విజయ ప్రచురణలు - ౧

# ప్రహ్లాముడి



రచన

గణపతిరాజు అచ్యుతరామరాజు, బి. ఏ., బి. ఎల్.

ప్రకాశకులు:

గుప్తా బ్రదర్స్,
విశాఖపట్నం.

ప్రచురణ స్వామ్యములు — గుప్తా బ్రదర్స్‌వారివి
ప్రదర్శన స్వామ్యములు — రచయితవి
ప్రథమ ముద్రణ — 1000 ప్రతులు
ముద్రణ — సెప్టెంబరు 55

ప్రదర్శకులు యీనాటకం ప్రదర్శించేముందు లిఖితపూర్వక అనుమతి పొందగోరెదను.

K. అచ్యుతరామరాజు.

# అంకితం

కవీ, నటుడూ, గాయకుడూ

నిత్య ప్రజాసేవానురక్తుడూ

మంచి

రసజ్ఞుడు, సహృదయుడూ

అయిన

ఆంధ్రరాష్ట్ర సహకార వాణిజ్యాది శాఖామాత్యుడు

**శ్రీ డి. సంజీవయ్య** బి. ఏ. బి. ఎల్. గారికి

ఈ నా కృతి

హృదయపూర్వకంగా

**అంకితం**

# "బ్రహ్మముడి" గురించి

1. ఈనాటకం యిదివరలో అయిదు మార్లే ప్రదర్శించబడ్డది.
2. ఇది కేవలం స్వకపోలకల్పితం- ఎవర్నీ, ఏసంస్థనీ ఉద్దేశించి వ్రాయలేదు.
3. మతిమరుపూ, చాదస్తం, అమాయకత్వం, దురభిమానం ఆ యా పాత్రలలో కలిసినప్పుడు ఎవరిదోషంలేకుండా సంభవించే పరిణామాలను చిత్రించదలచుకొని యీ నాటకం వ్రాశాను, ఏ పాత్రనూ హీనపరిచే ఉద్దేశం నాకులేదు.
4. ఎకౌండరు రిటైరుకావలసిన వయసువాడైనా ఉపాధిలేక ఉద్యోగంలోనే దేవుళ్ళాడుతున్న వ్యక్తిగాని ఆతతాయి కాడు.
5. ఒకటవ రంగంలోనూ చివరి రంగంలోనూ రెండుపట్టీల్లో (columns) సంభాషణలు వ్రాసేను. అంటే ఎవరి దారి వారిదిగా పాత్రధారులు చదవాలి. ఉదాహరణకి అయిదవరంగంలో ప్రిన్సిపాలూ, ఎకౌండెరూ ఒక విషయాన్నీ, సుబ్బావధాన్లూ, సోమప్పశాస్త్రి వగైరా యింకో విషయాన్నీ ముచ్చటించుకుంటారు.
6. చివరిరంగంలో సమ్మోహడావుడిని మంచి **Mimics** ద్వారానూ ఓ పదిమంది విద్యార్థుల సహాయంతోనూ చిత్రిస్తే రక్తికడుతుంది.
7. విరామాలవిషయం శ్రద్ధతీసుకోండి. **Punctuation** సరిగా చూడండి. ముద్రాపకులు తీసుకోగలిగినంత శ్రద్ధ తీసుకున్నారు.
8. ఏమైనా నా తోచే సలహా అవసరమైతే వ్రాయండి.

మీ,

**గణపతిరాజు అచ్యుతరామరాజు.**

# పాత్రలు



సోమప్పశాస్త్రి:—రిటైర్డు ఉద్యోగి

ప్రిన్సిపాల్ :—50 సం॥రములు.

కుమారశాస్త్రి:—తెలుగు లెక్చరర్, 25 సం॥రములు.

సింహాం :—సోమప్పశాస్త్రి మేనల్లుడు-విద్యార్థి.

గిరి :—సోమప్పశాస్త్రి కొడుకు విద్యార్థి.

కుటుంబం :—సోమప్పశాస్త్రి మేనల్లుడు - విద్యార్థి.

సుబ్బావధాన్లు :—సోమప్పశాస్త్రి బావమరిది
కుటుంబం తండ్రి
పోస్టల్ ఉద్యోగి - నేడో రేపో
రిటైరు కాబోతున్నాడు

ఎటెండర్ :—ఎటెండరు

మీనాక్షి :—సోమప్పశాస్త్రి కుమార్తె విద్యార్థిని.



# కృతజ్ఞత

---

ఈ నాటకం జయప్రదంగా ప్రదర్శించిన
ఆయా సంస్థలకూ, నటులకూ, ప్రదర్శకులకూ—
ఆదరంగా ప్రచురించిన మిత్రుడు
**శ్రీ విన్నకోట రామమూర్తి గుప్తాగారికి—**
నా
హృదయపూర్వక కృతజ్ఞత.

గణపతిరాజు అచ్యుతరామరాజు

ఎడ్రసు :—
ఏడ్వొకేటు
లలితాకాలనీ
విశాఖపట్టణం—

# భ్రష్టముడి

## మొదటిరంగము

సోమప్పశాస్త్రిగారి యింట్లో పిల్లలు చదువుకునే గది- ఆయన చెల్లెలు కొడుకు Ham పురఫు సింహం 'Screen' పత్రిక చదువుతున్నాడు. అప్రక్కనే యింకొక కుర్చీలో గిరి S. S. L. C. తెలుగు Text చదువుకుంటున్నాడు.

సింహం:— (నెమ్మదిగా) Madhubala will Sing her own songs in Sayyad at present under production in Bombay.

గిరి:—బొమ్మపెండ్లిండ్లకు
పోనొల్ల ననుబాల
రణరంగమున కెట్లు
రాదలంచె
మగవారిగనిన తా
మరుగుజేరెడు నింతి
పగవారి గెల్వనే
పగిదిజూచె.

సింహం:— (ఇంకొంచెం స్థాయి హెచ్చించి) Sagar Nizami, the well known Urdu Poet has written the songs and Jamal Sen ... ...

గిరి:—(స్థాయి హెచ్చించి)
పసిడి యుయ్యాలలెక్క
భయమందు భీరువు
ఖగపతిస్కంధ మే
కడిదినెక్కె

సింహం:—(చికాకుతో) Who made his show

గిరి:—(లక్ష్యంచేయక)
సఖుల కోలాహాల
స్వనము

| | |
|---|---|
| సింహం:— (ఇంకొంచెం స్థాయి హెచ్చించి) As a music Director in 'Sokhian' | గిరి:—(ఇంకా హెచ్చులో) లోర్వనికన్య |
| సింహం:— (చికాకుతో) is composing the musical score | గిరి:—(స్థాయి హెచ్చించి) పటహాభాంకృతుల కెబ్బంగి నోర్చ |

సింహం:—(మందలిస్తూ) ఒరేయ్ గిరీ !

గిరి:—(నిర్లక్ష్యంగా) ఓయ్ సింహం.

సింహం:—నన్ను disturb చేయకు. ఎవడిక్కావాలోయ్ నీ బొమ్మ పెళ్ళిళ్ళు ?

గిరి:—ఎవడిక్కావాలోయ్ నీ మధుబాల ?

సింహం:—నాకు

గిరి:—నాకు

| | |
|---|---|
| సింహం:—(తిరిగిచదువుతాడు) Opening today. The good girl was bad. The bad girl was good. You will say it is impossible till you see Naya Sansar's "Anhonee" | గిరి:—(తిరిగి) రాకేందుబింబమై రవిబింబమై యొప్పు నీరజాంతేక్షణ నెమ్మొగంబు కందర్పకేతువై ఘనసఘూమకేతునై యలరు ఘృాబోడి చేలాంచలంబు. |

సింహం:—ఒరేయ్ బావా! ఆ 'బాడి' కబుర్లు కట్టేసెయ్. అంతా **Nonsense.**

గిరి:—నీ 'సోఖియా' కబుర్లు కట్టేసెయ్. అంతా **Nuisance**

సింహం:—రాకేందుబింబం రవిబింబం యెలా అవుతుందిరా?

గిరి:—నీ **Bad Girl, Good Girl** యెలా అవుతుందిరా ?

సింహం:—నీకు తెలియదు ఫోస్ !

గిరి—నాకు తెలుసును లేస్ !

| | |
|---|---|
| సింహం:— **Nimmi the pocket sized Venus of** | గిరి:—(తిరిగి)<br>భావజుపరిధియై<br>ప్రళయార్కపరిధియై |
| సింహం:— **The Indian films has come a very long way since her promising debut in "Barsat"** | గిరి:—(ఇంకా హెచ్చులో)<br>అమృతప్రవాహమై<br>అనలసందోహమై<br>తనరారు నింతి<br>సందర్శనంబు. |
| సింహం:—**This talented daughter of a famous mother Wahidanbhai the singing star of Yesterday** | గిరి:—(ఇంకా హెచ్చులో)<br>హర్షదాయియై,<br>మహారోషదాయియై |
| సింహం:— **Has-Has-Has risen to the present top ranking status in the coterie of stars** | గిరి:—(ఇంకా హెచ్చులో)<br>పరగు ముద్దరాలి<br>బాణవృష్టి<br>హరికి నరికి |

సింహాం:—(కోపంతో) సరికేస్తానురోయ్

by virtue of her looks and acting ability

గిరి:—జూడ నందంద శృంగార

సింహాం:—Nimmi will be seen as she appears in this Photograph

గిరి:—వీరరసములోవి విస్తరిల్ల

సింహాం:—(చిరాగ్గా) ఏమిట్రా విస్తళ్ళూ, ఎంగిళ్ళూనూ

in - in - in Sagar Art corporation's "Mehman"

గిరి:—ఇవ్విధంబున రణంబున విక్రమించుటయు

సింహాం:—Scon shall the queen arrive in town to cast her Majestic Spell

(యింతలో యీ అల్లరి సహించలేక సోమప్ప శాస్త్రిగారి కూతురు మీనాక్షి లోపల్నించి వస్తుంది)

సింహాం:— (సోమప్పశాస్త్రి గారే వస్తున్నారేమో నని వెంటనే Physics పుస్తకం తీస్తాడు)

If two forces acting at a point be represented in magnitude and direction by the two sides of a parall - ellogram, drawn from one

గిరి:—(మామూలుగా)

శంపాలతాభ బెడిదపు టంపరచే ఘోర బా నవానీకంబుల్, పెం పరి సన్నాహంబుల సొంపరి భూసుతుని వెన్క జొచ్చెన్ విచ్చెన్.

of its angular points the resultant of these two forces is represented in magnitude and direction by the diagonal of the parallelogram drawn from that point

మీనా:—ఒరేయ్ గిరీ నీకేనాౢ చెబ్తుంటూ– ఏమిటూ అల్లరి బావని చదువుకోనివ్వకుండా

సింహాం:—If two forces acting at a point be represented in magnitude and direction ... ...

గిరి:—ఇంతసేపూ మధుబాలా నిమ్మీ అని చదువుతూ యిలా ప్లేటు మార్చేసావేం బావా ?

సింహాం:—మీ అక్కయ్యకు తెలియఁదేమిటి నేనే ... ...

(మీనాక్షి లోపలికి వెళ్తుంది)

దిలీప్ కుమార్, ప్రేమనాథ్ నని ... ఒరేయ్ గిరీ !

మీనా సరిగ్గా నర్గీసేనాౢ– ఆ face cut ఒహ్హో Really inexpressible – Oh! the beauty queen !

గిరి:—ఏం ! నాన్నతో చెప్పాలేమిటి నీ వేషాలూ నువ్వూనూ

సింహాం:—చెబితే చెప్పుకో– మనకేం భయమా ? మనపేరు సింహాం ! ఖబడ్దార్.

గిరి:—అయితే చెప్పమంటావ్ ? ... చెప్పేస్తున్నాను.

సింహం:—అయితే చెప్పకో మనకేం భయం! Our marriage after education is certain- మనం 'మీనా' మేనత్తకొడుకులం జాగ్రత్త.

గిరి:—మీనాక్షి మా అక్కయ్య జాగ్రత్త.

(ఇంతలో సోమప్పశాస్త్రిగారు వస్తారు)

సోమ:—(వీళ్ళని వుద్దేశించి అనడంలేదు.) ఇంతే వెధవలు వెధవ చదువులు- పెద్దవాళ్ళంటూ సకోశానా భయ మేడుస్తేనా ?- ఏమన్నా లక్ష్యం వుంటేనా ? ...

గిరి:—నేనేం అన్నాను నాన్నగారూ! సింహం బావేం ...

సింహం:—(భయపడ్డాడు) నేనేం అన్నాను మామయ్యా, గిరేం ... ...

సోమ:—చదువుకునేటప్పు డింత సొంపుగా ఏడుస్తున్నారు. ఇంక పెళ్ళిళ్ళు చేసుకొని వెలగబెడ్తారు కాపురాలు. వెధవాయలు- కుర్రినాగమ్మలు.

గిరి:—బావేం ...

సింహం:—మనం మీనా మేనత్తకొడుకులం అంటే తప్పా మామయ్యా.

గిరి:—చదువయిపోగానే అక్కయ్యని పెళ్ళిచేసుకుంటాడట.

సింహం:—అలా అనలేదు మామయ్యా! **Our marriage after education is certain** అన్నాను మామయ్యా. యింతసేపూ గిరిగాడు పెళ్ళో పెళ్ళో అని యేడుస్తుంటేనూ—

గిరి:—అదికాదు నాన్నగారూ! వాడిపేరు సింహమటా ...

సోమ:—కాదుటా? మరి

గిరి:—అదికాదు నాన్నగారూ ...

సోమ:—అహహ— అదికాదు నేననేది ... హేమో హేమో అని నలుగురూ పిలిస్తే **Ham** అయిపోతాడటా?.

గిరి:—అదికాదు నాన్నగారూ ... అందుకని

సోమ:—అందుకనీ ?

గిరి:—మీతో చెబితే చెప్పకో మంటున్నాడు. ఏం భయం లేదట.

సోమ:—భయాలొకటీ యీకాలపు కుర్రకుంకలికి— నాగమ్మలకి— రెణ్ణాళ్ళయివచ్చి ఆసన్యాసి మొహమైనా చూపలేదు.

గిరి:—అదికాదు నాన్నగారూ ... అక్కయ్యట అచ్చంగా...

సింహం:—వాళ్ళ మేనత్తపోలికే— మా అమ్మలా గుంటుందన్నాను.

గిరి:—నర్గీస్ మీ అమ్మలా గుంటుందటా? ?

సోమ:—అదేవర్తిరా? ... రేణ్ణెల్లయివచ్చి ఏం తిరుగుళ్ళు తిరుగుతున్నాడో జులాయి తిరుగుళ్ళు ... నాలుగు వందలు ఖర్చా.

సింహాం:—(తననేమోనని) అదేంటి మామయ్యా.

సోమ:—మామయ్యున్నాడని గుర్తుందా నాగమ్మకి?

గిరి:—ఏంటి నాన్నగారూ! సింహాం లెఖ్ఖ మనకేమిటి నేను లేనూ!

సోమ:—సింహామూకాదు గాడిమసింహామూకాదు– వాడూ ఆవెధవ ... ఇదిగో చూడు (ఉత్తరం కవరుతోసహా యిస్తాడు)– ఏపదిహేనేళ్లయో U. P., C. P. అని బదిలీలయి వాళ్ల నాన్నతోపాటు నానాదేశాలూ తిరిగాడా, అయినవాళ్లం, వూళ్ళో వున్నామని యిప్పుడయినా వచ్చి మనతో వుండొద్దూ ... చిన్నతనమట బడుద్ధాయికి– రేపైనా వాడి అజా పజా కనుక్కోవాలి. ఎంత చచ్చినా మేనత్త మొగుణ్ణేనా పయివాణ్ణా!

సింహాం:—అదెవరు మామయ్యా?

సోమ:—(గిరితో) ఒరేయ్! చదువుకొని అమ్మాయి కియ్యి. అదైనా రేపు కాలేజీలో వాకబుచేస్తుందేమో (సింహాంతో) రా అబ్బాయి– యీవిషయం మాట్లాడుకుందాం (సోమప్ప– సింహాం యింట్లోకి వెళ్తారు)

గిరి:— (లోపలి వుత్తరం తీసి కవరు టేబిలుమీదికి విసిరి వుత్తరం చదువుతుంటాడు.)

తే......ది.

శ్రీమత్సకల గుణసంపన్నులైన మహామేరుసమాన ధీరులైన ధీవిభవ వాచస్పతులైన, ఐశ్వర్య సంధాన నవనిధిపతులైన...(హమ్మయ్య) మందబుద్ధులసోమప్ప శాస్త్రిలుంబావగారికి, · బోడసకురు౹) సుబ్బావధాన్లు ఆశీర్వాచనములు— త॥ ఇచ్చట అంతా క్షేమం. అచ్చట నీయోగ క్షేమములు తరుచూ వ్రాయవలెను. నేనిన్నాళ్ళకు మనవాళ్ళందరిమధ్యావచ్చి ఏడ్చాను. పదిహేనేళ్ళయి వుద్యోగరీత్యా U P;C. P. వగైరా అన్యదేశాలు ఏడ్చి తిరిగి యిప్పటికిక్కడ యేడుస్తు న్నాను. యీవిషయం నీకు తెలుసును. అబ్బాయి కుటుంబం యీదగ్గర్లో ఎక్కడైనా చదివి ఏడవ మంటే Tuition బాగా ఏడవదని పట్నంలో జాయి నవుతానని ఏడ్చి మీకాలేజీలో F. A. లో జాయి నయినాడు. రెణ్ణెల్లాయి రూ 400/- లు పట్టుకువచ్చి ఎక్కడేకుస్తున్నదీ యింకా తెలియజేయలేదు. వాళ్ళ తల్లి రాత్రింబవళ్ళు ఏడుస్తున్నది. నన్నేడిపిస్తున్నది. డిపార్టుమెంటువాళ్ళు సెలవివ్వమంటే ఏడ్చుకుని సెల విప్పక ఏడిపిస్తున్నారు. అబ్బా యక్కడ ఏం ఏడు స్తున్నదీ తెలియదు. ఇంత యిదిగా నన్నేడిపించడం

వాడికి భాగ్యంకాదు- యీవిషయం ప్రిన్సిపాలు గారితో వచ్చి నా వేషం చూపవలసింది. మీ యింటికి తీసుకుపోయి వాడివేషం మార్చవలసింది. నేనొక్క-డెలాగో యేడ్చి సెలవు తెచ్చుకొని అక్కడనుంచొచ్చి యేడుస్తాను. మీ యింట్లోపడి ఉండమంటేనో వేషం మంటే తనకి మొగమాటమౌతోంది యేడుస్తున్నానని యేడ్చాడు. ఇంతవరకూ ఒక్కఉత్తరం కూడా వ్రాసి యేడవలేదు. Hostel లోనే యేడుస్తున్నాడో యింకెక్కడ యేడుస్తున్నాడో వ్రాయవలసింది. సొమ్మయిపోయి యేడిస్తే సర్దుబాటు చెయ్యవలసింది. నేనెలాగో యేడ్చి నీకుపంపిస్తున్నాను. ఇట్లు,

గ్రహించవలెను.

జోగేశ్వరుడు [illegible]

అక్కయ్యా (వెడుతూ) ([illegible])

(మీనాక్షి ప్రవేశిస్తుంది)

మీనా:—(నిద్రాంతపోయి) ఏం అలా ఏడుస్తున్నావు ?

గిరి:—యీవుత్తరం చదివిచూడు నీకూ ఏడుపొస్తుంది.

మీనా:—ఎన్నిసార్లు చెప్పేను. నాకొచ్చే ఉత్తరాలు చదవ వద్దని.

గిరి:—నాన్నగారు చదవమంటే చదివేను. చదివి ఏడుస్తు న్నాను.

మీనా:—నాన్నగారు చదవమన్నారా ? ఏడవమన్నారా ?

గిరి:—నువ్వు చదివేది నీకే తెలిసేడుస్తుంది.

మీనా:—మళ్ళీనావుత్తరాలు ముట్టుకో, ఆవుత్తరాలేడుపు నీకెందుకురా ? (కొడుతుంది)

గిరి:—పోనీ యిదిగో (వుత్తరం యిస్తాడు-కవరు టేబిలుమీదే వున్నది. మీనాక్షి లోపలికిపోతుంది) ఆఏడుపుత్తరాలు చదివితే అక్కయ్యకెందుకో అంతఏడుపు.

ఇంతలో వీధిలోంచి "మీనాక్షమ్మగారూ" అని కేక

గిరి:—ఎవరో యిలా లోపలి కేడవండి.

(ఏకాండరు ఒక Text Book పట్టుకు వస్తాడు)

ఏకాం:—మీనాక్షమ్మున్నారా ?

గిరి:—లోపలేడుస్తూంది ... నీ ఏడుపేమిటి ?

ఏకాం:—మాటలు మాత్రం సరిగ్గా రానీండి. ప్రిన్సిపాలు గారంటే నే పడనుగాని.

గిరి:—పోనీ నేనంటే పడిఏడు,

ఏకాం:—(ఇతనితో మనకెందు కన్నట్లు) చెప్పండీ మీనాక్షమ్మున్నారో లేరో ?

గిరి:—చెప్పేను కాదుటయ్యా! లోపలేడుస్తుందని.

ఏకాం:—ఇంకా ఏడుపు లెందుకు గానండి. అసల్ది చెప్పండి.

గిరి:—ఏం ? ఏంకావాలి ?

ఏకాం:—ఈపుస్తకం యిచ్చిరమ్మన్నారు తెలుగు లెక్చెరరు గారు.

గిరి:—అలా పడిచ్చిపో బల్లమీద.

ఎకెం:——లేదా అమ్మగారికే యివ్వాలి.

గిరి:——నేనా అమ్మగారి స్వంత తమ్ముణ్ణోయ్.

ఎకెం:——ఆ అమ్మగారికే సొంతంగా యిమ్మన్నారండీ.

గిరి:——ఈ అయ్యగారికే స్వంతంగా యివ్వంటున్నానయ్యా.

ఎకెం:——అయితే భద్రం ... ఇదిగో టేబిలుమీద పెడుతున్నాను. (నిష్క్రమణ)

గిరి:——(అటూ యిటూ చూచి ఎకెండరు తెచ్చిన పుస్తకాన్ని తిరగేస్తాడు. పేజీలు త్రిప్పగా ఆకుపచ్చటి కాగితం కనబడుతుంది. తీసి చదువుతాడు)

ప్రేమనగర్
ప్రణయ విహార్
వసంతర్తు.

హే ప్రియే.

**Frank** గా కాకుండా కవుల భాణీలో వెళ్ళబోయమన్నావ్! ఎంత బాధాకరంగా వుంటుందో చూడు యీపద్ధతి—

చారుశీలా! ఆంధ్రోపన్యాస సమయంలో తావకీన కృపాపాంగ వీక్షణ దర్శనామాత్ర కల్లోలిత హృదంతరానంద వారాన్నిధీ జనిత తుషార శీకరము లనంత వియద్ధునీభంగ నీరాజనాదు లిడును నాహృదిని. త్వదక్షివిక్షేపమక్షీణ క్షణక్షణావిర్భాత భంగ సంజాత సంకుల సంభ్రమతో మీనాక్షీ నివ

హామ్మ్ర త్రోషింపజేయును. నీకనుల నీలినింగిమలు త్రోచు, నీ నడల రాయంచగతులుత్రోచు, నీ వేణి ఫణిరాణితోచు ... చచ్చాను. ఇంకిలా రాయలేను. ఖచ్చితంగా చెబ్తున్నాను. నువ్వు నాదానివి. మీా యింటికి వచ్చే సౌకర్యాలకోసం చూస్తున్నాను. ఇంత స్వల్పకాలంలో మన పరిచయం యింత దృఢ మౌతుందనుకోలేదు. మళ్ళీ, మళ్ళీ అంటున్నాను. నువ్వు నాదానివి. ఈ ఎరెండరుద్వారా యీా అవ కాశాన్ని వినియోగపర్చుకున్నాను.

నీ ప్రియ

బో ... ... కు

వీడెవ డీబోకు. చంపేడు. మా Text కంటే జటి లంగా వుందే...ఇవా వీళ్లు చెప్పే పాఠాలు. ఇందుకా అక్కాయిగారి వుత్తర నిరీక్షణ.

(ఇంతలో సింహాం, సోమప్పశాస్త్రిగారూ వస్తూ వీధిలోకి వెళ్తూ)

సోమ:—అబ్బాయ్ గిరినడిగి అది పత్రా యిప్పాడే పోదాం కాలేజీకి. యీా వేళే తేల్చేద్దాం. (నిష్క్రమణ)

సింహాం:—అదిలా యియ్యి. (గిరి యీాలోగా కవరులో పెట్టి వుత్తరం దాయబోతుంటాడు)

గిరి:—ఏమిటది ?

సింహాం:—అవుత్తర మిలా యియ్యి. కాలేజీకి పోవాలి.

గిరి—మీా తెలుగు మాస్టారూ ...

సింహం:—బోకు గొడవ ఎందుకురా యిప్పుడూ- ఇచ్చేయ్ మామయ్యవతల వుండిపోయారు.

గిరి:— మీా తెలుగు మేస్టారు పుస్తకం పంపించేరు (సూచిస్తాడు)

మీానా:—(అర్థంకాలేదు) ఇలా యిచ్చి ఆపుస్తకం (టేబిలు మీాది Text తీసుకుంటుంది)

సింహం:—ఇస్తావా! తగలాలా (కొట్టి వుత్తరం లాక్కుంటాడు)

సోమప్ప:—(ప్రవేశించి) ఏదిరా? ఆవుత్తరం (కవరుతో సహితం తీసుకుంటాడు) యింతసేపూ యేం చస్తున్నారు. (సింహంతో వీధిలోకి వెళ్తాడు)

మీానా:—ఆపుస్తకం నిన్నెవడు తియ్యమన్నాడు వెధవ! (కొడ్తుంది)

గిరి:—నువ్వు చచ్చావులే యీామాకు.

మీానా:—మళ్ళీ నోరెత్తు (కొడ్తుంది)

గిరి:—నీకోసమేనే రాక్షసీ! ఆపుస్తకం యెవరు పంపేరు?

మీానా:—ఏవడో ఒకడు. నీకేం?

గిరి:— కాదక్కయ్యా! ఆపుస్తకం మీా మేస్టారిదేనా? అందులో ...

మీానా:—నిన్నెవడు చూడమన్నా డదంతా (కొడ్తుంది)

గిరి:—నీ చేతులు పడిపోను. ఆ రాసినవాడి చేతులు పడి పోనూ.

మీనా:—ఏమిటూ ఆ రాసింది ?

గిరి:—ఉత్తరం ... ఎవడో బోకు.

మీనా:—అదెందుకూ నాన్నకీ ?

గిరి:—బోడసకుర్రు మామయ్యా వ్రాసిన వుత్తరం అనుకున్నారు.

మీనా:—చచ్చానమ్మో (లోపలికి వెళ్ళిపోతుంది)

గిరి:—చచ్చావా ? నేను చెప్పలేదూ చస్తావని.

— తెర —

---

# భ్రష్టముడి

## రెండవరంగము

కాలేజీ ప్రిన్సిపాలుగారి గది- డ్రాయరూ, కుర్చీలు, పుస్తకాల రేక్, బల్ల, గడియారం, ఆఫీసుకేలండరు, కాలింగ్ బెల్, ఫొటోలు యింకా యితర పరికరాలు ప్రదర్శకుల ఓపికనుబట్టి.

సోమప్పశాస్త్రి:— (వస్తూనే కవరు Principal గారికి యిస్తూనే, తను కూర్చుంటూనే) పీడిసంగతి కొంచెం భోగట్టా చేద్దురూ.

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడిందండి పీళ్ళతోనూ. ప్రేమ వ్యవహారాల్లో పడుతున్నారువీళ్ళు.

సోమ:—పడితే పడొచ్చునండి...అహహ అదికాదు నేననేది వచ్చిన రెణ్ణెల్లలోనూ పడ్డాడే మా అని

ప్రిన్సి:—రెణ్ణెల్లూ, నెలా అని ప్రేమలకి కాలనిర్ణయం ఏమిటండి? మహాచెడ్డచావండీ ప్రేమంటేనూ. అదిపుట్టుకొచ్చిందంటే గోదావరి వరదలా గమ్మున రెచ్చిపోతుందండి. మహాచెడ్డచావులెండి దాంతో.

సోమ:—దానికి చావేమిటండి ..అహహా...పెద్దవాళ్లం వున్నామన్న భయమన్నా వుందీ వాడికీ.

ప్రిన్సి:—మహాచెడ్డ చావులెండి మాకాలేజీతో-పచ్చి ప్రవరాఖ్యుడుకూడా పాదంపెట్టిన రెణ్ణాళ్ళకి శృంగార నాయకుడైపోతాడు.

సోమ:—అయిపోనివ్వండి ... అహహా అదికాదు నేననేది పెద్దవాళ్ళతో చెప్పినే అయిపోమ్మంటున్నాను.

ప్రిన్సి:—మీకేం ఎన్నయినాఅంటారు. మాకొచ్చిపడుతుంది మహాచెడ్డచావు. కాలేజీ ప్రిన్సిప్లను పాటేమిటంటారు? ఇంకొకడి రెజీములో పోయినా ఫరవాలేదు. మన రెజీములో అలాంటివేం జరక్కూడదు.

సోమ:—ఎందుకు జరుగుతుంది. మా అమ్మాయి చెబ్తానే వుంటుంది ఆడవాళ్ళ అంగరక్షకుల్లా మీరొకంట చూస్తుంటారని.

ప్రిన్సి:—ఎంతమాట. అందుకనే కష్టపటండి Ladies waiting room ప్రక్కకి మార్పించేను నా Office room— ఇదిగో మీకు భరోసా యిచ్చేస్తున్నాను. ఒకఅమ్మా యిని యింకో అబ్బాయి ప్రేమించడానికి వీల్లేదు నా రెజీములో, నా కాలేజీలో.

సోమ:—అందుకే యిద్దరూ పీకుల్లో పడుతున్నారు లేక పోతే కొంపల్లోకి జొరబడుతున్నారు — ఉత్తరాలు నడుపుతున్నారు.

ప్రిన్సి:—అయ్యా, మీ రావుత్తరంగురించి అట్టే బాధపడకండి. యిప్పుడే వస్తాడు క్లాసయిపోగానే. నామట్టుకే నేనీ వేళ్ళు తిడతాను. మీమట్టుకు మీరూ వేళ్ళు తిట్టండి... మహా చెడ్డచావొచ్చిపడ్డదండి పిల్లల్తోనూ.

సో మ:—తిరవాం లెండి ... అహహ అదికాదు నేననేది వచ్చి రెణ్ణాళ్ళాయిందా ఆజీతం రాళ్ళేం తగలేస్తు న్నాడో దరిద్రపు తిరుగుళ్ళు తిరుగుతూనూ - తల్లీ తండ్రీ మేనత్తమొగుడూ వున్నారన్న ధ్యాసయినా ఏడ్చిందేమిటి నాగమ్మకి

ప్రిన్సి:—మహాచెడ్డచావే-చూద్దురుగాని సస్పెండుచేయించి తీరతాను. ఇవా యిక్కడ మేం నేర్పుతున్న పాఠాలు. యిందుకా మేం యితన్ని కాలేజీలో జాయిన్ చేసు కుంది ?

సోమ:—ఎందుకైతే కానివ్వండి... అహహ అదికాదు నే న నేది. ఆ అబ్బాయిరాగానే మాయింటికోసారి తీసుకు వెళ్ళి అక్కడే ఆనాలుగు చీవాట్లూ వేస్తాను. స్మరి షను యిప్పించండి......

[ఇంతలో తెలుగు లెక్చరర్ కుమారశాస్త్రిగారు వస్తారు-యువకుడు-చేతిలో పుస్తకాలు]

కుమా:—నేనయి యింకా క్లాసుకి వెళ్ళలేనుసార్. అడుగు పెట్టిందగ్గర్నుంచీ "జోకు" "జోకు" అని స్టూడెం ట్సంతా ఒకటేగోల. ఏం పాఠాలు జరుగుతాయి. ఆ రెంకో డివిజనుకి వేయించండి.

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడ్డదయ్యా నీతో. వట్టినే ఎందు కంటారు. చెడుతిరుగుళ్ళు తిరిగితేనే అంటున్నారు.

సోమ:—తిరిగితే తిరగనివ్వండి...అహాహ అదికాదు నేపనేది అంతసామ్ము యేంచేసావయ్యా యీరెణ్ణాళ్ళకీని.

కుమా:—(తెల్లబోతాడు) ... మీరెవరు ?

ప్రిన్సి:— (ఆకుపచ్చవుత్తరం చూపుతూ వెటకారంగా) మీమామగారు.

కుమా:—(తెల్లబోయి) మామా మెవడు ?

సోమ:—(కోపంగా) మీమేనత్త మొగుణ్ణి-సరా ?

కుమా:—(నిర్ఘాంతపోతూ) మామేనత్తెవర్తె ?

సోమ:—(కోపంగా) మా ఆవిడ

కుమా:—మీ ఆవిడెవరు ?

సోమ:—మీ మేనత్త

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిందే...పోనీ నీ ప్రియురాలి నాన్నగారు సరేనా ?

సోమ:— పోనీగాని రెణ్ణెల్లయి వచ్చి యింటికి వుత్తరం వ్రాశావ్ ? మీనాన్నున్నాడనుకున్నావా ? చచ్చాడనుకున్నావా ? పెద్దవాళ్ళతో చెప్పి చావరాదూ పెళ్ళిళ్ళయినా చేసేస్తారు.

కుమా:—మీరెవరో మాటలు తిన్నగారాసిండి చావుకబుర్లెత్తితే వూరుకోను.

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడిందే... పోనీచెప్పు వుత్తరం వ్రాసావా లేదా ?

కుమా:—రాయలేదు. గదీగట్రా దొరికితేగా రాయటానికి.

ప్రిన్సి:—ఈయనింట్లోకి చేరే సౌకర్యాలకోసం చూస్తుండు వీళ్ళమ్మాయికి పాఠాలూ చెప్పొవచ్చు- నువ్వువాళ్ళ వాడివి అయిపోతావు.

సోమ:—ఇలాంటి చెడుతిరుగుళ్ళమీద నాకునచ్చలేదబ్బాయ్! బుద్ధిగా మసులుకోవాలిగాని...కావలసినవాళ్ళెవ్వళ్ళో వున్నారా?

కుమా:—(దురుసుగా) నాకెవడూ లేడీవ్వాళ్ళో.

సోమ:—అందుకే అలా ఏడిశాడా వుత్తరం? తల్లీదండ్రీ ఖాతరీవుంటే ఎందుకలా వుత్తరం రాస్తాడు.

ప్రిన్సి:—వీళ్ళకి ప్రియురాళ్ళమీదేగాని తండ్రిమీదా తల్లిమీదా వుంటుందటండి...ఉత్తరాలే ప్రియురాళ్ళకో అయితే కవిత్వం వెలగబెట్టి కుమ్మించి రాసి పారేస్తారు.

సోమ:—పారేస్తే పారేయనీయండి ... అహహా అదికాదు నేననేది. ఒకసారి అబ్బాయినింటికి తీసుకువెళ్తాను.

ప్రిన్సి:—తీసుకువెళ్తే తీసుకువెళ్ళండిగాని ... యిలా యింకో మారు జరిగిందని తెలిస్తే (Suspend) సస్పెండు చేస్తాను. మహాచెడ్డ చావొచ్చిపడ్డది యీ డిసిప్లిను రూల్సుతో.

సోమ:—పదబ్బాయి మనవాళ్ళు చూస్తుంటారు...వెంటనే ఆచోకీ దొరికింది...వెర్రితండ్రి...పద మనింటికి పద.

పమా:—నాక్లాసుందిప్పుడు. మీరెవరోగాని నన్ను చంప కండి. పాఠాలుపోతాయి.

సోమ:—ప్రిన్సిపాలుగారి నడిగానుకాదటోయ్...పద...పద వుత్తరం భోగట్టాలు చాలా మాట్లాడుకోవాలి

పమా:—ఏం వుత్తరం ? నేనెవరికీ వుత్తరంరాయలేదు.

సోమ:—అదే ఎందుకురాయలేదో కనుక్కుందామనే... పద, పద.

పిన్సి:—అన్నీ అవసరమైనప్పుడవే బయటపడతాయిలే నీ

కేపాలూ నువ్వూను ? రాయలేదట వుత్తరం ! ఎంతనిర్భ యంగా చెబ్తున్నాడూ ?

మా:—(ప్రిన్సిపాలుతో) సార్, నన్నిలా బాధపెట్టకండి క్లాసులో వాళ్ళలాగా-మీరిలాగా ... అసలుసంగతి చెప్పకుండానూ ...

న్సి:—నాకాలేజీలో నారెజీంలో యిలాంటివి జరగడానికి వీల్లేదు. కమిటీలోపెడతా నన్నీ తేల్తాయి.

మ:—పోనీలెండి... నేనుకనుక్కుంటాగా !

మా:—అయ్యో ! బలవంతపుమామగారూ ! మీరెవరో ఎందుకొచ్చారో నాకేం అయోమయంగా వుంది. నన్నిప్పుడెక్కడికి యెందుకు తీసుకువెళ్తున్నారో కాస్త యీచెవిని వేయండి. మిమ్మెన్నెన్నడూ నేను చూడలేదు.

సోమ:—నువ్వు చూడకపోతే నేంలే? ఇన్నాళ్ళకి నిన్ను నేను చూచానదే సంతోషం, పద పద. అన్నీ యింటిదగ్గర మాట్లాడుకుందాం.

ప్రిన్సి:— ఆయన్ని చూడకపోతేనేం? వాళ్ళమ్మాయిని రోజూ క్లాసులో చూస్తున్నావుగా

సోమ:—(ప్రిన్సిపాలుతో) అమ్మాయికి కాస్తకబురు పంపిస్తారూ!

ప్రిన్సి:—క్లాసులో వున్నట్టుంది. తర్వాతొస్తుందిలెండి నేను కనుక్కొని పంపిస్తాను.

సోమ:—పదపద యింటికి.

కుమా:—నాకేం యిల్లులేదు.

సోమ:—నాయిల్లుంది

ప్రిన్సి:—నీకేం పరాయి యిల్లుకాదుతే ... మహాచెడ్డ చావొచ్చిపడింది.

కుమా:—మీకాక్కాదు. నాకు.

సోమ:—పదబ్బాయి పద. (కుమారశాస్త్రి భుజంమీద చెయ్యివేసి బలవంతాన లాక్కుపోతాడు)

ప్రిన్సి:—నేనెప్పుడైనా యెవర్తైనా ప్రేమించి యెరుగుదునూ ... మహాచెడ్డ చావొచ్చిపడింది యీ ప్రిన్సిపాలుహోదాతో ... ఒరేయ్

(ఎటెండరు ప్రవేశం)

ఎటెం:—సార్!

ప్రిన్సి:...నేను పిలిచానని చెప్పి II Year మీనాక్షిని ఒకసారిలా పిలు.

ఎటెం:—మీరు పిలిచేరనండీ? ఎందుకు పిలిచేరనండి?

ప్రిన్సి:—నీ కెందుకురా ఆడవాళ్ల గొడవలు? వెళ్ళి పిలు.

ఎటెం:—ఎవర్నండి?

ప్రిన్సి:—మీనాక్షినిరా. II Year – తెలుగుక్లాసులో వుంటుంది. I. A. Common Class (కామన్ క్లాసు)

ఎటెం:—(Common Class) కామన్ క్లాసులో లేకపోతేనండి?

ప్రిన్సి:—ఇంకో క్లాసులో వుంటుంది.

ఎటెం:—అక్కడా లేకపోతేనండి?

ప్రిన్సి:—వెయిటింగ్ రూమ్‌లో వుంటుంది చూడు.

ఎటెం:—ఒకవేళ అందులోనూ లేకపోతేనండి?

ప్రిన్సి:—ఇంటికి పోయిందేమో మిగతా గర్ల్సని అడుగు.

ఎటెం:—వాళ్లకి తెలియదంటేనండి?

ప్రిన్సి:—ఇంటికి వెళ్ళి అర్జంటుగా రమ్మన్నానని పిలుచుకురా

ఎటెం:—ఇంటిదగ్గరా లేకపోతేనండి?

ప్రిన్సి—మహాచెడ్డ చావొచ్చిపడిందిరా నీతో. లేకపోతే తిరిగి వచ్చేసేయ్.

ఎటెం:—అయితే యెందుకు వెళ్ళడమండి?

ప్రిన్సి:—(కోపంతో) మహాచెడ్డ చావొచ్చిపడిందిరా నీతో నిన్ను డిస్‌మిస్ చేసేస్తాను జాగ్రత. వెళ్ళి వెయిటింగ్ రూములో చూడు.

ఎటెం:—చూస్తే చాలాండి?

ప్రిన్సి:—(కోపంగా) పిల్చుకురారా.

ఎటెం:—ఇప్పుడే పిలాలాండి?

ప్రిన్సి:—(కోపో్రేకంతో) ఒరేయ్! వెళ్ళు ముం దవతలకి.

ఎటెం:—అయితే వెళ్తానండి (వెళ్తాడు)

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడింది. ఎటెండరుగాడి దగ్గ ర్నుంచీ లెక్చరర్ల దాకా సమస్యలే. లెక్చెరరుకి కూడా ప్రేమకలాపమే. ఈలోగా ఆకుపచ్చ వుత్తరం కొంచెం కంఠతాపెడతా నెందుకైనా మంచిది. ఈవిడ admit ఎడ్మిట్ చేసిందంటే ఆబోతు పని పట్టేస్తాను. (వుత్తరం కంఠస్థం చేస్తుంటాడు)

(మీనాక్షి, ఎటెండరూ ప్రవేశం)

ప్రిన్సి:—(కుర్చీ చూపుతూ) అలా కూర్చో మీనాక్షీ!

ఎటెం:—నే నిక్కడ వుండాలాండి?

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడ్డదిరా నీతో. (విసుగుతో) అవతలకి పో.

ఎటెం:—గుమ్మం దగ్గిర వుండేదాండి?

ప్రిన్సి:—ఎలాగో తగలబడు.

ఎటెం:—(వెళ్తూ) అవసరమొస్తే పిలుస్తారు కదండి(వెళ్తాడు)

ప్రిన్సి:—(శాంతంగా) మీనాక్షీ!

(తిరిగి ఎటెండరు వస్తాడు)

ఎటెం:—ఎవరేనా ఒస్తే ఏం జెయ్యాలండి?

ప్రిన్సి:—ఇప్పుడు నన్ను చూడ్డానికి వీలులేదని చెప్పు.

ఎటెం:—ఎందుకు వీలులేదని అడిగితేనండి ?

ప్రిన్సి:—లోపల వ్యవహారాలు మాట్లాడుతున్నారని చెప్పరా

ఎటెం:—ఏం వ్యవహారాల నడుగుతేనండి ?

ప్రిన్సి:—మటప్- ఆడవాళ్ళగొడవలని చెప్పు.

ఎటెం:—(రెండడుగులు వేసి వెళ్ళబోయి) ఎవరితో మాటాడ తున్నారంటే చెప్పొచ్చాండి ?

ప్రిన్సి:—చెప్పు మీనాక్షితోనని- గర్ల్ స్టూడెంటుతోనని.

ఎటెం:—మళ్ళీ యెప్పుడు రమ్మంటావనడిగితేనండి ?

ప్రిన్సి:—(కోపంగా) ఒరేయ్.

ఎటెం:—యీవేళింక వీల్లేదని చెప్పేదాండి ?

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడ్డదిరా నీతో. నీయిష్టం వచ్చినట్లు చెప్పు.

ఎటెం:—అలాగే చెప్తాలెండి (వెళ్తాడు)

ప్రిన్సి:—మీనాక్షీ !

(తిరిగి ఎటెండరు ప్రవేశం)

ఎటెం:—లెక్చరర్లొచ్చినా అదేసమాధానమాండి ?

ప్రిన్సి:— (టేబిల్ మీదున్న రూళ్ళకర్రయెత్తి) ఒరేయ్ నిన్ను డిస్మిస్ చేసేస్తాను.

ఎటెం:—అలాగే చెప్తాలెండి (వెళ్తాడు)

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడ్డది యీలెక్చరర్లతో... మీనాక్షీ !

మీనా:—(జడిసికొని) ఏంసార్ !

ప్రిన్సి:—(ప్రసక్తి ఎలా తేవాలో తెలియక) ... నేనెవరు ?

మీనా:—(ఆశ్చర్యపడి) కాలేజీ ప్రిన్సిపాలు

ప్రిన్సి:—(అప్రయత్నంగా) నువ్వెవరు ?

మీనా:—(బోధపడలేదు) నాపేరాండి ?...మీనాక్షి

ప్రిన్సి:—కాదు. ఏమిటి చేస్తున్నావ్ ? నీ (Status) స్టేటస్

మీనా:—సెకండియర్ స్టూడెంటుని

ప్రిన్సి:—(బాధ్యత చెప్పేందుకు) అంటేగర్ల్ స్టూడెంటువి ? అవునా ?

మీనా:—అవునండి

ప్రిన్సి:—బోకెవరు ?

మీనా:—ఏ బోకండి ?

ప్రిన్సి:—అతనేంచేస్తున్నాడీ కాలేజీలో ?

మీనా:—నాకు తెలియదండి ?

ప్రిన్సి:—లెక్చెరరు ? అవునా ? లెక్చెరరు అంటే

మీనా:—(Translate) ట్రాన్స్లేటుచేసి చెప్పనాండి ?

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిపడిందే నీతో. లెక్చెరరు అంటే గురువు. అవునా ? పోనీలేయింకపన్నీ యెందుకు డైరెక్టుగా అడిగేస్తున్నాను ... ఎన్నాళ్ళయింది అతను కాలేజీలో జాయినయి.

మీనా:—ఎవరండి ?

ప్రిన్సి:—బోకు.

మీనా:—రెణ్ణెల్లయిందండి.

ప్రిన్సి:—నువ్వతనికి వుత్తరాలు రాస్తున్నావా ?

మీనా:—ఊళ్ళోవున్నవాళ్ళకి వుత్తరాలెందుకండి ?

ప్రిన్సి:—అదే. చేతివుత్తరాలు. ప్రేమలేఖలు.

మీనా:—(నిర్ఘాంతపోయి) చచ్చానుబాబోయి.

ప్రిన్సి:—మహాచెడ్డఛావొచ్చిపడిందే నీకో.

మీనా:—(అభిమానంతో) సార్! యిందుకా నన్నిక్కడికి పిలిపించారు ఎవరులేకుండా చూసి.

ప్రిన్సి:—ఎందుకు పిలిపించిందీ తర్వాత తెలుస్తుందిలే. చెప్పు. ఎవరెండరుద్వారా రాయబారాలు పంపుతున్నావా ?

మీనా:—నేనా ? అమ్మనాయనోయ్ ?

ప్రిన్సి:—పోనీ అతను పంపుతున్నాడా ?

మీనా:—అతనా ? అయ్యబాబోయ్ !

ప్రిన్సి:—తెలుగుక్లాసులోనే కాదూ మీప్రేమలు పుట్టుకొచ్చాయ్.

మీనా:—ఏమోనండి.

ప్రిన్సి:—మీయింటికొచ్చేసే సౌకర్యాలు చూసుకుంటున్నాడుకాదూ తనూ ?

మీనా:—నాకు తెలియదండి.

ప్రిన్సి:—నారెజీంలో నేను ప్రిన్సిపాలుగావుండగా లెక్చరర్లున్ను గర్ల్సున్నూ ప్రేమించుకోవచ్చునూ ?

మీనా:—కూడదండి.

ప్రిన్సి:—నేను ప్రిన్సిపాలునై వుండగా లెక్చరర్ను నువ్వు ప్రేమించవచ్చునా ?

మీనా:—నాకేం అర్థంకావడంలేదు మీధోరణి.

ప్రిన్సి:—నా అంతవాడు ప్రిన్సిపాలై వుండగా స్టూడెంటుగాణ్ణో లెక్చరర్నో లౌవ్ చేయొచ్చా ?

మీనా:— నాకేం బోధపడ్డంలేదు ... మీరేదో అదో యిదిగా మాట్లాడుతున్నారు.

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిందే నీతో ... ఏమన్నాయిదేనూ ?

మీనా:—ఇక్కడ కిప్పుడెందుకు పిలిపించారో బోధపడ్డంలేదు.

ప్రిన్సి:—మన ప్రేమవిషయం కనుక్కోడానికి (వెటకారంగా వుద్దేశించి అన్నాడు)

మీనా:—ఎటండర్నుకూడా అవతలకు పొమ్మన్నారు.

ప్రిన్సి:—మనమంచికే. వాడెందుకీ గొడవల్లో.

మీనా:—సార్ ! నేను వెళ్ళిపోవాలి. మిమ్మల్నిచూస్తే యెందుకో భయంగా వుంది ?

ప్రిన్సి:— భయంగా వుందేం ? ఎందుకుండదూ ? పెద్దవాళ్ళ దగ్గర ఆమాత్రం గర్ల్సుకి భయంవుండాల్లే ?

మీనా:— మీధోరణేం బాగాలేదు. నాన్నగారితో చెబ్తాను.

ప్రిన్సి:— మీనాన్నగారిందాక వచ్చారులే. ఆయన యిష్టం మీదే యిప్పుడు పిలిపించేను.

మీనా:— సార్ ! ఎటండర్ని పిలుస్తాను. నాకేదో భయంగా వుంది.

ప్రిన్సి:— వాడెందుకూ మనమధ్య. నేనడిగినవాటికి వప్పుకుంటే ఏమీలేదు.

మీనా:— (గాభరాపడి) సార్ !

ప్రిన్సి:— అయితే యిదిగో మన ప్రేమవ్యవహారం యెంత వరకూ ముదిరిందీ తేల్చేస్తాను. (కవరు తీసి యీయ బోతాడు) యిదిగో యిదివుంచు నీదగ్గర. చూడు

మీనా:— (సొమ్మొస్తున్నాడేమో ననుకొని) ... సార్ ! నేనేం సంసారిననుకున్నారా ? లేక ...

ప్రిన్సి:— ఇది పుచ్చుకుందూ- అన్నీ అవే తేలిపోతాయి.

మీనా:— ఏమిటి తేలేది ? నేనేం అంత తేలిగ్గా కనబడు తున్నానా మీకంటికి ?

ప్రిన్సి:— లేదు లేదు... ఇది ఓసారి చూచుకో. యిందులో చాలావుంది లే కథ ... మొగమాటపడకు. ఇంకా ఏమన్నా నాకందితే యిస్తానులే ... కవరుతీసిచూడు.

మీనా:—(కవరులాక్కుని) మేష్టారూ ! ... యివన్నీ నాకెం దుకు ? నన్ను ... నన్ను ... ఏమనుకున్నారు. (కవరు టేబిలుమీదకి విసిరేస్తుంది)

ప్రిన్సి:—(ఆలోచించాడు) సరే అయితే! ... హే ప్రియే! ... చారుశీలా ! నీనడల రాయంచగతులు తోచు. నీవేణి ఫణిరాణి తోచు.

మీనా:—సార్ ! ఏమిటీ ధోరణి ?

ప్రిన్సి:—ఫ్రెంకుగా కాకుండా కవులభాణీలో వెళ్ళబోయు మన్నావ్ ? ...

మీనా:—మీకేం న్యాయంకాదు ... ఇలాంటి విషయాల్లో మీకు దిగితే మీపేరూ ప్రతిష్ఠా ... ?

ప్రిన్సి:—ఖచ్చితంగా చెబుతున్నాను. నువ్వు నాదానివి. మళ్ళీ మళ్ళీ అంటున్నాను. నువ్వు నాదానివి.

మీనా:—(భయోద్వేగంతో కంపించి) మేష్టారూ ?

ప్రిన్సి:—ఇంత స్వల్పకాలంలో మనపరిచయ మింత దృఢమౌతుందనుకోలేదు ... మళ్ళీ అంటున్నాను. నువ్వు నాదానివి.

మీనా:—(భయోద్వేగం) నేను వెళ్లిపోతాను. మీకు న్యాయంకాదు. గర్ల్సుని యిలా ఏడ్పించడం.

ప్రిన్సి:—ఈ ఎటెండరు ద్వారా యీ అవకాశాన్ని విని యోగపర్చుకున్నాను....ఇప్పుడైనా అవునంటావా ? అను. అవునను.

మీనా:—వాడూ మీతో కలిసేడూ! ఎటెండర్! ఎటెండర్! నే నిక్కడుండలేను. మా నాన్నగారితో చెబ్తాను. కాలేజీ ప్రిన్సిపాలు చేసే పనిదా (వెళ్ళబోతుంది.)

ప్రిన్సి:—ఇదిగో ... నన్ను బోధపర్చుకో. గాభరాపడకు. అవునంటే ఏంపోయింది. కవరు చూడమంటే చూడ వాయెను. చెప్తే వినవాయెను. మహాచెడ్డ చావొచ్చి పడ్డది నీతో.

మీనా:—ఛీ !

ప్రిన్సి:—కాలేజీ ప్రిన్సిపాలుని జాగ్రత్త !

(ఎలెండరు ప్రవేశం)

ఎలెం:—నన్నిప్పుడు పిలిచారాండీ ?

ప్రిన్సి:—నిన్నెవడు పిలిచేడురా రాస్కెల్ ?

ఎలెం:—మీరన్నట్టు యిక్కడే వున్నానండి గుమ్మంఅవతల ... దిగబెట్టామంటారాండి. అమ్మగారిని.

మీనా:—ఛీ- రాస్కెల్ ... యిందులో నువ్వావున్నావ్ ?

ఎలెం:—నాతప్పేముందమ్మా. అయ్యగారు పిలుచుకురమ్మంటే వచ్చాను.

ప్రిన్సి:—మీనాక్షీ- చూడు యీకవరు ?

మీనా:—ఛీ- మళ్ళీ అదేమాటా (తొందరగా నిష్క్రమణ)

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిందిరా వీళ్ళతోనూ ?

ఎలెం:—మరి మీరిలా మాట్లాడితే ఎవరుమాత్రం అవునంటారండి.

ప్రిన్సి:—నువ్వా అదేమాటా- మహాచెడ్డ చావొచ్చిందిరా నీతోను ?

— తెర —

—

# బ్రహ్మముడి

## మూడవరంగము

(సోమప్పశాస్త్రిగారి యిల్లు – ఒకగది అలంకరణలతో)

సోమ:—అబ్బాయ్! నువ్వలా మొగమాటపడకు. మీనాన్న రాసేదులే నువ్వుచాలా మొగమాటస్తుడివని. నువ్వెన్ని మాయకబుర్లుచెప్పినా నేను నీమేనత్తమొగుణ్ణి కాక పోతానూ?

కుమా:—అయ్యా! శాస్త్రిగారూ! నన్ను బాధపెట్టకండి ... నాకు తెలియకుండా మీరు నామేనత్తమొగు డెలా అయిపోతారు?

సోమ:—మంచిమాటే ... నీ పర్మిషను పుచ్చుకొని పెళ్ళాడిందేమిటి మీమేనత్త ... అయినా యీకాలపు కుర్రకుంకలికీ ...

కుమా:—కాదండీ! నాకొక్కర్తే యిల్లుపట్టిన విధవమేనత్త గారుంది ... ఆవిడెప్పుడూ మిమ్మల్ని పెళ్లాడినట్లు చెప్పలేదు.

సోమ:—సరే! అయితే ఆవిడైయుండదులే ... మా ఆవిడ నన్నే వెధవను చేసిపోయింది ... పోనీ! యింతకీ మీనాన్నున్నాడా?

కుమా:—నిక్షేపంలావున్నారు ... ఆయనకేం ... అయ్యా, నన్నట్టే చంపకండి ... నాపేరు కుమారశాస్త్రి ... ఇంటిపేరు బోడపాటివారు. వైదీకులంగోత్రం, ఋషి, వారి మేనల్లుణ్ణి. ప్రస్తుతం కాలేజీలో తెలుగు లెక్చరర్ని. స్వగ్రామం కోనసీమలో బొబ్బర్లంక ... ఇదవ్వాడే పదిహేనోసారి చెబ్తుండడం.

సోమ:—మరి నిన్నెందుకు చూపేడూ ఆప్రిన్సిపాలూ ? మా వాడి నడిగితేనూ.

కుమా:—ఎందుకేమిటీ నన్ను చంపడానికి ... తెలుగు మాస్టర్నికాదూ, హాస్య మాడేడేమో ? మాకంటె లోకువైన వాళ్ళెవరున్నారు కాలేజీల్లో.

సోమ:—అయితే ... కావచ్చు ... అహాహా అదికాదు నేననేది నాలాంటివాడితో హాస్యాలేమిటీ పెద్ద ప్రిన్సిపాలయివుండి ?

కుమా:—తప్పలేదులెండీ ... కాను మొర్రో అంటే నా మేనత్త మొగుణ్ణని యింతసేపూ మీరు హాస్యాలాడలే ?

సోమ:—అబ్బాయి ! జరిగిపోయిందాని కట్టే ఆలోచించకు "ప్రమాదోధీమతామపి" అన్నారు పెద్దలు.

కుమా:—పోనీలెండి. మీధర్మమా అని ఒకక్లాసు తప్పింది, లేకపోతే "బోకు, బోకు" అని నానాగొడవా చేసేవాళ్ళు కుర్రకుంకలు.

సోమ:—బోకేమిటబ్బాయ్ ?

కుమా:—నాఖర్మ బోడపాటి కుమారశాస్త్రిని కదండీ కాంపోజిషను పుస్తకాల్లో ఖర్మం కాలి "బోకు" అని అచ్చు తెనుగుని యినీషియల్సు (Initials) అఘోరించేను. దాంతో ఖాండవవనం అంటుకున్నట్టు కాలేజీ అంతా యీపేరు అంటుకుపోయింది.

సోమ:—అంటుకుపోతే అంటుకుపోయిందిలే...అహాహా అది కాదు నేననేది ... మరి నువ్వు ఫలానా అని యింతకు ముందే చెప్పకపోయావ్

కుమా:—ఎన్నిసార్లు చెప్పనండీ ? ... మీరేం వినిపించుకుంటేనా ?...మరినాకు సెలవిప్పించండి వెళ్ళివస్తాను (వెళ్ళబోతాడు)

సోమ:—మంచిదబ్బాయ్ ! వెళ్ళిరా ... మాట ... నీకు పెళ్ళయిందా ?

కుమా:—ఆయ్యా, అయిందండీ...నాలుగేళ్ళయింది.

సోమ:—ఏం...పిల్లలా ?

కుమా:—ఒకకొడుకండి...ఏదో ?

సోమ:—ఏదోఏమిటి ఖేషూ !...ఎక్కడుంటున్నావ్ ?

కుమా:—సత్రంభోజనం–మఠాన్నిద్ర...'సంపెంగా' లాడ్జిలో (Students) స్టూడెంట్సు మధ్య అందాకా వుంటున్నాను...నానాగోలగానూవుంది...కోతిమూక

సోమ:—ఎంతిస్తున్నావేమిటి గదికి ?

కుమా:—కాపీనమంత గదికి నలుగురంకలిసి నలభై రూపాయ లిస్తున్నాం. దేవుడు సాక్షాత్కరిస్తే దణ్ణంపెట్టడాని చోటులేదు.

సోమ:—చోటులేకపోతే పోనీలే నేను చోటిస్తాను...నీకే అభ్యంతరంలేకపోతే ఆవీధివైపు గదులు రెండు వాడుకో ... మీవాళ్ళొస్తే యేదో యేర్పాటు చేద్దాంలే యోగ్యుడివి.

కుమా:—రెండుగదులయితే...ఏమాత్రం యిచ్చుకోవలసి వుంటుందండి ?

సోమ:—ఆఁ అదేమిటబ్బాయ్... ఓపదిహేనో.ఎంతో నీక తోచినంత యిద్దూగాని...పిల్లలున్నారూ వాళ్ళకీ ఏవో నాలుగు ముక్కలు పట్టుబడతాయి.

కుమా:—నాకేం అభ్యంతరంలేదుగాని కాలేజీలో గొడవై పోతుంది...మీకూనాకూ చికాకులూ !...

సోమ:—చికాకులొస్తే రానీయ్‌లే ! నేనుండగా నీకేం భయం ... వెళ్ళిరా ... సామానూగట్రా పట్టిం చుకురా మరికాదనకు...వెళ్ళు...ఏదోపొరపాటుకు కష్టపడితేయెలా ?

కుమా:—మరింత అల్లరయిపోతుంది ... లేనిపోని కట్టు కథలూ...

సోమ:—కథలూ లేవు, కాకరకాయలూ లేవు... వెళ్ళిరా ...

కుమా:—సెలవు

సోమ:—ఏమిటా సెలవ్ మళ్ళీ వెంటనే సామానుతో రమ్మని నా సెలవ్ ?

కుమా:—వస్తానూ ?

సోమా:—శీఘ్రం (కుమార శాస్త్రి నిష్క్రమణ)

సోమ:—వెఱ్ఱితండ్రి ఏం యోగ్యుడు పాపం ! మాకుటుంబం అనుకొని అన్నిటిట్లూ తిట్టినా ఏం అనడే ? పెద్దింటి బుద్ధులు ... రానీ పిల్లలకి కూడా శాస్త్ర తెలుగు చెప్తాడు అయితే యీకుటుంబం గాడెక్కేడేడుస్తున్నట్టు (గిరి అప్పుడే స్కూలునించి వచ్చి తన టేబిలుదగ్గర కూర్చుంటాడు)

గిరి:—(మెప్పుకి తెలుగు పుస్తకంతీసి) "శంపాలతాభ బెడిదపు టంపరచే" (పద్యం అలా చదువుతూనే వుంటాడు)

సోమ:—ఒరేయ్ ! గిరీ ! నీకు బోకుని తెలుసున్రా

గిరి:—అంతబాగా తెలియదు (చచ్చాను అవుత్తరం సంగతి తెలిసిపోయింది)

సోమ:—అతనేం కవిత్వం చెబుతాడేమిట్రా పూర్వకవుల భాణీలోనూ

గిరి:—నేనేం చదవలేదు నాన్నగారూ !

సోమ:—పోనీ అక్కయ్యేం చదివిందా అతని కవిత్వం ?

గిరి:—అక్కయ్యకీ ఏం తెలియదు నాన్నగారూ

సోమ:— తెలియకపోతే పోనీలే ఇంత స్వల్పకాలంలో అంత పరిచయ మేముంటుంది?

గిరి:—మాకెవరికీ అంత పరిచయం లేదు నాన్నగారూ

సోమ:—పోనీ అతని పుస్తకాలేం నీదాకా రాలేదూ?

గిరి:—అతని పుస్తకాలు నాకెవరిస్తారు నాన్న గారూ [వెధవ ఆ ఎటెండరు గాడు చెప్పేసేడు కాబోలు]

సోమ:—పోనీ అక్కయ్య కెవరన్నా యిచ్చారా?

గిరి:—మనింటి కొచ్చి యిచ్చే వాళ్ళెవరున్నారు? ఎటెండ ర్లొస్తే యేడువీధులు తరిమేస్తాను.

సోమ:—ఏ మాటయినా ఖచ్చితంగా చెప్తాడేం?

గిరి:—నేనతని మాటలేమీా వినాలేదూ చదవాలేదు.

సోమ:—పోనీ యికముందు ఏమన్నా పుస్తకాలిస్తాడు పుచ్చు కొని చదువుతూండు...అక్కయ్య కూ్కడా యిస్తూ వుండు.

గిరి:— నేనేం పుస్తకాలు పుచ్చుకోనూలేదు అక్కయ్య కివ్వాలేదు అలా అని ఎవరన్నారు? [వెధవ ఆ ఎటం డరే చెప్పేసేడు]

సోమ:—పుచ్చుకోరా? తప్పేమిటి? అలాంటివి చదువు తుంటే ఎంత జటిల సమాసమైనా యిట్టే చదివే యొచ్చును.

గిరి:—అందుకని వాళ్ళవెనకాలా వీళ్ళవెనకాలా తిరుగు తూండమంటారేమిటి- మనకేం నౌకర్లా? ఎటెండర్లా?

సోమ:—ఎటెండర్లెందుకూమధ్యా? మనయింటి కతనొచ్చేసే సౌకర్యాలన్నీ చూచానులే ... అతనికొక్కవల్సిందీ అదేను ... మనయింట్లోనే వీధిగదుల్లో బస యిస్తు న్నాను.

గిరి:—ఆ సింహాం బావనుంచి ఒచ్చిదంతానూ ... ఒద్దురా అంటే కొట్టి లాక్కుపోయాడు.

సోమ:—ఏమిటదీ ?

గిరి:—ఆ వృత్తరం ?

సోమ:—అయితే ఏమొచ్చింది ?

గిరి:—ఏమొచ్చింది! ... ఆబోకు నొకణ్ణితెచ్చి యింట్లో పెడ్తానంటున్నారు. ప్రిన్సిపాల్ దాకా యిదొకటి మోసేసేరు ... యింక అక్కయ్య కన్నీచిక్కులే.

సోమ:—ఏం ? ఏమిటాచిక్కులు ?

గిరి:—మేనల్లుడికోసం వెళ్ళి మేష్టర్ని తెచ్చి యింట్లోపెట్టారు ... కాలేజీలో నానాగొడవానూ ?

సోమ:—గొడవైతే అయిందిలే- ఆవీధిగదులు ఖాళీచేయించి వస్తానుండు (వీధిగదులవేపు వెళ్తారు. ఆవైపునుంచే సింహాం ప్రవేశం)

సింహాం:—(మాంచికోపంలో). ఈసింహాం గాడున్నాడన్న లక్ష్యమన్నావుందీ. ... మళ్ళీ ఆమాటనమను డొక్క

గిరి:—మళ్ళీ గట్టుమీాదెందుకు బావా? ఆ చెరువులోనే కప్పెట్టీవచ్చునుగా? ... ఇంతకీ వాడెవడు?

సింహాం:—ఇదేంచేస్తుందీ అంట? వాడలా పేల్తుంటే చెప్పుచ్చుకొని అడాపెడా వాయించీ వొద్దూ?

గిరి:—బహుశా మర్చిపోయి యుంటుందిలే ... ఎవరూ అక్కర్యేనా? దానికి మందమతి ... పోనీ నువ్వు జ్ఞాపకం చెయ్యకపోయేవ్?

సింహాం:—నేను లేన్రా అంటే? ... ఉంటే దుమ్ము లేరీనూ? వీడూ వీడిచదువూ ఎవడిక్కావాలి? ... ఈవేళో రేపో వాడిరక్తం కళ్ళజూసేనే?

గిరి:—మళ్ళీ సందేహమెందుకు? ఖచ్చితంగా చెప్పేయ్ ఏరోజో? యీవేళా? రేపా?

సింహాం:—వాడిబుర్ర చిదగ్గొట్టి నిద్రపోతాను.

గిరి:—అలాగ్గాని చేసావ్? నాన్నగారు నీకాపని చేస్తారు మంచిదో స్త్రీగావుంది వాళ్ళవ్యవహారం?

సింహాం:—ఉంటే వుండనీ యీావ్యవహారం ఫైసలుచేసి మరీ వస్తాను. ... ఒరేయ్ ఏదన్నా కత్తుందిరా?

గిరి:—లేదుబావా! పాతబ్లేడుంది ... యిచ్చేదీ?

సింహాం:—ఏదన్నా కర్రందుకో?

గిరి:—నాన్న పట్టుకుపోయారు.

సింహాం:— చూడేస్ యింట్లోనూ.

గిరి:—ఇంట్లో యెక్కడున్నాయ్ ? వంటింట్లో కొరకంచు తెచ్చేదీ ?

సింహం:—ఒరేయ్ ! నెత్తి బద్దలుగొడ్తాను ... ఏమిటి హాస్యాలేమిటి నాతో ?

గిరి:—మధ్యను నన్నెందుకూ కొట్టడం ?

సింహం:—నిన్నుకాదు – వాడిని ... రా యెత్తేస్తాను ... దుమ్ము లిరగబొడుస్తాను. కప్పెట్టేస్తాను. డొక్క చీల్చేస్తాను. నెత్తి బద్దలుగొడతాను. రక్తంతాగు తాను. (నిష్క్రమణ)

గిరి:—కాఫీ తాగేసిపో ... లోపల చల్లారిపోతుంది ... (తనలో) ఉత్తరాలే అనుకుంటే డబ్బిచ్చేవరకూ వచ్చిందీ వ్యవహారం ? బోకుగాడు, పెళ్ళాం పిల్లలూ వుండీ వీడికేంపోయేకాలం ... నాన్న దన్నొకటి యేడ్చింది వీడికి ... యింక యింట్లోనే తిష్ఠవేస్తు న్నాడు ... యింతకీ మనబంగారం మంచిదైతే ...

(మీనాక్షి యింతలో వస్తుంది)

గిరి:—(గదమాయిస్తూ) ఆగక్కడ ఎక్కడ నుంచొస్తు న్నావ్ ? వాడిగది నుంచేనా ?

మీనా:—నోర్మూయ్ !

గిరి:—సొమ్మిస్తానన్నాడటగా పుచ్చుకోలేక పోయేవ్ ?

మీనా:—ఛీ నోర్మూయ్ ! ఎవడన్నా డామాట

గిరి:— వాడన్నాడని ఎవరెండరన్నాడని సింహం బావన్నా
డని నేనంటున్నాను

మీనా:—నువ్వూ అదేమాటా... నాఖర్మ ... ఇంక నేనా
కాలేజీకయి వెళ్ళలేను (ఏడుస్తూంది)

గిరి:—మరీమంచిది ... మనింట్లోనే తిష్ఠ వేస్తూన్నాడులే
మేష్టరు ... ఈ బోకు గొడవ లింతవరకూ వస్తాయని
నేననుకుంటూనే వున్నాను

మీనా:—(లాలనగా) ఒరేయ్! గిరీ! నాన్నగారితో చెప్పి
పంపించేసేయ్ మన కెందు కీగొడవలన్నీ ... నేనింక
ఆకాలేజీకయి వెళ్ళను వెళ్ళలేను (లోపలికి వెళ్తూంది)

గిరి:—దీని ఏడుపిలావుంది ఆ బోకుని బాకుపెట్టి పొడిచేస్తా
నని సింహంగా డేడుస్తున్నాడు. ఈ సంగతేదో నాన్న
గారికి చెప్పి మేష్టార్ని యింట్లోంచి పంపించెయ్యాలి
... లేకపోతే ఏ రాత్రినో బావ పొడిచేస్తా డేమిటో!

(ఇంతలో సోమప్పశాస్త్రిగారు వస్తారు)

సోమ:—ఒరేయ్ గిరీ! మేష్టారొచ్చారు కాస్త ఆసామానూ
అదీ సర్ది పెట్టరా గదుల్లోనూ.

గిరి:—బావ సర్దేస్తాడు లెండి యీ రాత్రి.

సోమ:—రాత్రే కానీలే యిప్పుడు నువ్వు వెళ్తావా? వెళ్ళవా?

గిరి:—(గాభరాగా) నాన్నగారూ! నేను వెళ్ళి సామానదీ
సర్దుతాను కాని మేష్టార్ని సామాను పట్టుకొని తిరిగి
వెళ్ళిపొమ్మనండి.

సోమ:—(పరాకుగా) వెళ్ళిపోమ్మనొచ్చులే ... ముందత గానికి గదులు ఖాళీచేసి వప్పగించు.

గిరి:—గదులు ఖాళీచేసి వప్పగిస్తాను లెండి కాని మేష్టార్ని గదులు ఖాళీచేసి వెళ్ళిపొమ్మనండి.

సోమ:—వెళ్ళిపొమ్మనొచ్చునులే మళ్ళీ దుర్ముహూర్తం ప్రవేశిస్తూంది వెంటనే ప్రవేశించమను.

గిరి:—ప్రవేశించమంటాను లెండి కాని వెంటనే వెళ్ళిపొమ్మనండి దుర్ముహూర్తం ప్రవేశిస్తూంది.

సోమ:—ప్రవేశిస్తే ప్రవేశించనీ ... ముందు వెళ్తావా ? వెళ్ళవా ?

గిరి:—వెళ్తాను లెండిగాని ఆయన్ని వెళ్ళిపొమ్మంటారా ?

సోమ:—(గ్రహించి) ఏమిటీ ?

గిరి:—మేష్టార్ని వెళ్ళిపొమ్మనండి ... యీ యింట్లో వుండడానికి వీల్లేదని చెప్పండి ? కాలేజీపిల్లలున్న యిల్లు.

సోమ:—ఎవడాని ఆమాటన్నదీ ?

గిరి:—సింహాంబావా, అక్కయ్యా వాళ్ళతర్వాత నేనూను ... అక్కయ్య యింకిలా అయితే చదువుమానేస్తానంటున్నది.

సోమ:—అంటే అననీయ్ లే- యోగ్యుడు. ఇంటిదగ్గరేవుండి చదువు చెబ్తాడు.

గిరి:—సింహాంబావా ...

సోమ:—వాడూ మానేస్తానంటున్నాడా? అననీ. అడుక్కు తింటాడు. మనకేం?

గిరి:—అదికాదు నాన్నగారూ సింహాంబావా ...

సోమ:—చదువుకుంటా నంటున్నాడా? భేషూ! మంచిదే.

గిరి:—అదికాదు నాన్నగారూ. సింహాంబావా. మేష్టార్ని వెతుక్కొని తిరుగుతున్నాడు ... కాచుకు కూర్చు న్నాడు.

సోమ:—కూర్చుంటే కూర్చోనీలే ... ఎందుకూ మేష్టారే మనింటి కొచ్చేస్తేనూ?

గిరి:—మనింట్లోనే అలాంటిగొడవలు జరిగితే మనకీముప్పు... మేష్టారికీ ముప్పే.

సోమ:—అయితే కానీలే. నేనుండగా ఎవడికీ ముప్పురాదు. నువ్వు నోర్మూస్కో.

గిరి:—అదికాదు నాన్నగారూ ... సింహాంబావే ...

సోమ:—నోర్మూయ్ ముందు ... నాదగ్గరిలాంటి వెర్రివేషాలు పనికిరావు ... (వీధిగదులవేపు నిష్క్రమణ)

గిరి:—చచ్చీ చావొచ్చింది ... చెప్పింది వినిపించుకోరేం నాన్నగారు. ఆయన చాదస్తమేకాని ... ఎందుకైనా మంచిది. మేష్టార్ని యీవేళ కాచుకు తిరగాలి ... ఏ సినీమాకో II Show కి ఆయన్ని లాక్కుపోయి ఆయన గదిలోనే యీవేళ మకాం వేస్తాను. ఇక్కడ నుంచి నాన్నగారాయన్ని వెళ్ళగొట్టనిస్తారూ?

(ఇంతలో కుమారశాస్త్రిగారు వస్తారు)

కుమా:—ఏమయ్యా! శాస్త్ర సాయంచేస్తే అరిగిపోతావ్ ? పాపం మీనాన్నగారే సాయంచేస్తున్నారు.

గిరి:—అలాగే కానీండిగాని ... యీవేళా రేపూ కొంచెం జాగ్రత్తగా వుండండి. మంచిరోజులు కావు.

కుమా:—ఫర్వాలే...మీనాన్నగారు పెట్టిన ముహూర్తమే.

గిరి:—మా సింహాంబావ యింకో ముహూర్తం పెట్టించేడు.

కుమా:—ఆఁ అతనికేం తెలుసును. నాన్నగారికంటే తెలుసునేమిటి ?

గిరి:—అలా కొట్టిపారేయకండి మేష్టారూ! సింహాంబావ తనకి తెలిసినవాళ్ళెవరిచేతో పెట్టించిన ముహూర్తమే అయివుంటుంది.

కుమా:—ఏమిటంటూరు వాళ్ళు ?

గిరి:—ఈరెండు రాత్రుళ్ళు కొంచెం జాగ్రత్తగా వుండమంటున్నారట ?

కుమా:—లేకపోతే ?

గిరి:—ఒంటికి మంచిదికాదట ... ఉద్యోగరీత్యాకూడా.

కుమా:—పోనీ అంతేకద ... వెధవక్లాసులు ఒదిలిపోతాయ్.

(ఇంతలో ఎటెండరు వస్తాడు)

గిరి:—ఏం ? ఎందుకొచ్చావిక్కడికి ? ఏమన్నా మోసుకొచ్చావా ?

ఎకెం:—మీకు సంబంధించింది కాదులెండి.

గిరి:—నాన్నగారితో చెప్పేనంటే ఏడుపీధు లవతలికి గెంటే స్తారు.

ఎకెం:—మేష్టారున్నారా అంటే లోపలున్నారు పోయి చూడని మీనాన్నగారే అన్నారులెండి. (వీధివేపు నుంచి సోమప్పశాస్త్రిగారు) "ఒరేయ్ గిరీ! యీపెట్టెలవీ సర్ది పెడుదువుగాని ఓసారిలారారా ?"

గిరి:—(వెళ్తూ) మేష్టారూ! వెళ్ళి సర్దుతాను ... తర్వాత II Show సినీమాకి తీసుకువెళ్ళాలి సార్ ... రాత్రి మీ రూంలోనే మననిద్ర ... లేకపోతే దుర్ముహూర్తం ... (నిష్క్రమణ)

ఎకెం:—ఈ యింట్లో దిగుతున్నారా అండి ?

కుమా:—అవును.

ఎకెం:—మీ రొక్కరూనాండి ?

కుమా:—అవును.

ఎకెం:—మీపిల్లల్ని యింత వేగం తీసుకురారు కదాండి ?

కుమా:—అవును.

ఎకెం:—అద్దెంతండి ?

కుమా:—ఏం యింకా సరిగ్గా నిర్ణయంకాలేదు ... ఒరేయ్! నీ కెందుకురా యీ ప్రశ్నలన్నీ ?

ఎకెం:—ప్రిన్సిపాలుగారు తమవిషయంలో కొంచెం జోరుగా వున్నారండి. ఇక్కడెవరూ లేరుకదండి ?

కుమా:—లేరు.

ఎకెం:—ప్రక్కగదిలోనండి ?

కుమా:—అక్కడా లేరు.

ఎకెం:—ఇంకా లోపలండి ?

కుమా:—ఎవరో వుంటారు.

ఎకెం:—అయితే యిక్కడ చెప్పొచ్చునాండి ?

కుమా:—చెప్పు. చంపక.

ఎకెం:—ఎవరన్నా వింటారేమోనండి ?

కుమా:—వింటే విననీ.

ఎకెం:—(సందేహిస్తూ) మీరు మీనాక్షమ్మతో చాలా అదో యిదిగా తిరుగుతున్నారని ఏవో అవీ యివీ పంపుతున్నారని వాళ్ళూ వీళ్ళూ తనతో అలాగిలాగ చెప్పేరని, యీ వేళో రేపో మీపని అటో యిటో ఎటో తేల్చేస్తానని ఆఫీసులో అంటున్నట్టు సూచా వాచా తెలుస్తున్నట్టుందండి.

కుమా:—ఈ వేళో రేపో నాపని అటో యిటో తేల్చుతాడా ? ... తేల్చమను ... ముందు తన పని చూసుకోమను ఈ కాలేజీ వుద్యోగం లేకపోతే అదే పోయింది.

ఎకెం:—మహాకోపంగా వున్నారండి ... అదేదో చికాగ్గా వున్నారండి ... ఒంట్లో బాగా లేనట్టున్నారండి ...

అదేదో యిదిగా వున్నారండి ఆ అమ్మతో మాట్లాడిన దగ్గర్నుంచీని.

కుమా:—ఏ అమ్మతో రా ?

ఎకాం:—ఇంకెవరు ... మీనాక్షమ్మ గారితో మాట్లాడిం దగ్గర్నుంచీని

కుమా:—ఏమిటా మాటలు ?

ఎకాం:—అబ్బో చాలాకథుంది లెండి ... వింటే మీరు మహో యిద్దైపోతారు ... ఆ ఆగ్రహంలో ఏంచేసేస్తారేమిటో ?

కుమా:—ఏమిటది ?

ఎకాం:—రండి యింకోదగ్గర చెప్తాను ... యిక్కడ చెప్తే పీకలు తెగిపోతాయి. (నిష్క్రమిస్తారు)

---

# బ్రహ్మ ముడి

## నాలుగవ రంగము.

(ప్రిన్సిపాలుగారి ఆఫీసుగది ... ప్రిన్సిపాలుగారి తలకీ చేతికీ కట్లు కట్టబడివున్నాయి — గది అలంకరణ రెండవరంగంలో లాగే — ...ఎటెండరు దగ్గరలో నిలబడ్డాడు)

ప్రిన్సి:—ఆ బోకుగాడి పనేయిదీ ... మీనాక్షికూడా ఏవో రెండుముక్కలు పీడిచెవిని వేసివుంటుంది. వాళ్ళ ఆటలుసాగవని ... యిప్పుడు వాళ్ళింట్లోనే మకాం వేసాడుగా నాజీతం తిని నాకేద్రోహం తలపెట్టాడూ?

ఎటెం:—"నాపని అటో యిటో తేల్చుతాడా? ... తేల్చమను ... ముందు తనపని చూసుకోమను" అని కూడా అన్నారండి.

ప్రిన్సి:—చీకట్లోచేసి ఎవరూలేకుండాచూసి సందుమొగను ... మహాబలమైన దెబ్బకొట్టేడులే. తలమీద ... రానీ వాడిపనిపడ్తాను.

ఎటెం:—ఒకటేనాండీ తగుల్తా ... పాపం!

ప్రిన్సి:—ఒకటేమిట్రా ఒళ్ళంతా చిదగబొడిచీసేరు వాడి గేంగంతా.

ఎటెం:—ఒళ్ళంతా నొప్పులు నొప్పులుగా వుందాండి?

ప్రిన్సి:—ఒక్క ఒళ్ళేమిటి ప్రాణాలన్నీ తోడుకుపోతుంటేనూ.

ఎకెం:—(జాలిగా) పాపం! మీ ప్రాణాలే హరించీద్దురు కాబోలండి. ఇంకానయం. ఇంకోనాలుగు మీతల మీద వేస్తే మీరు చచ్చేపోయుందురు పాపం ... రక్తం ఓ సోలెడు లెఖ్ఖని కారిందాండి ?

ప్రిన్సి:—(కోపంగా) ఒరేయ్! ఎందుకురా ఆలెఖ్ఖలన్నీ నీకు ?

ఎకెం:—దేంతో కొట్టాడండి ?

ప్రిన్సి:—కర్రలు పుచ్చుకున్నార్రా నలుగురూ తలకోక కర్రాను.

ఎకెం:—ఇంకానయం కత్తులు పుచ్చుకు రాలేదు ... చచ్చే పోదురు.

ప్రిన్సి:—మహా చెడ్డ చావొచ్చిందిరా నీతోనూ ? ... అవన్నీ నీకెందుకు ... వెళ్ళి వాణ్ణి పిలుచుకురా పో ... వీడిపని యీ వేళ్టితోసరి ... యింకా వెళ్ళవేం ... వెళ్ళూ (ఎకెండరు నిష్క్రమణ)
వీడ్ని Dismiss చేసి తీరతాను అమిగతా. వెధవల పేర్లు కూడా బయట పడ్డాయంటే అప్పుడందరిపనీ పట్టొచ్చు ...

(ఇంతలో సోమప్పశాస్త్రిగారు వస్తారు)

సోమ:—అయ్యో ప్రిన్సిపాలుగారూ మా కుటుంబం సంగతేం ఆలోచించేరు కారు.

ప్రిన్సి:—[ఇప్పుడా వీడికి టైము దొరికింది] అయ్యా! మీ కుటుంబం సంగతి మీ మీనాక్షి నడగండి ... ఆవిడే చూసుకుంటుంది లెండి ... నాతో ఆగొడవలన్నీ చెప్పకండి ... నా గొడవల్లో నేను చస్తూన్నాను.

సోమ:—మంచిదే ... అహహ అదికాదు నేననేది ... అసలేమైనా మా కుటుంబం సంగతి ఆలోచించారా

ప్రిన్సి:—[మహ చెడ్డ చావొచ్చిందే ముసలాడితోనూ] అయ్యా! అవన్నీ యిప్పుడు ఆలోచించడానికి టైము లేదు సార్! యింకా ముఖ్యమైనవి ఆలోచిస్తున్నాను ... మీ మీనాక్షి నడగండి ఆవిడే చెబ్తుంది.

సోమ:—చెబ్తుంది లెండి ... అహహ అదికాదు నేననేది (ప్రిన్సిపాలు కట్లు చూస్తాడు) అదేమిటి తలకి కట్టు కట్టారు ... ఏం తలనొప్పా? దెబ్బా?

ప్రిన్సి:—(మహచెడ్డ చావొచ్చింది) లేదుసార్ ... ఏ నొప్పీలేదూ నొప్పంతా పోయిందిలెండి ... దెబ్బే ప్రాణం పోయిందను కోండి.

సోమ:—పోతే పోయుంటుంది లెండి ... అది కాదు ... ఎలా తగిలింది?

ప్రిన్సి:—(మహచెడ్డ చావొచ్చిందే యీయన తోనూ) మీ మీనాక్షినడగండి ఆవిడే చెబుతుంది.

సోమ:—చెబుతుంది లెండి ... అదికాదు ... దాని కెలా తెలుస్తుందీ మీకు దెబ్బెలాతగిలిందీ నీ?

ప్రిన్సి—ఆవిడకి తెలిసేవుంటుంది లెండి లేకపోతే మీ బోకు మేష్టర్ని అడగండి అన్నీ చెబ్తాడూ యావత్తు పూస గ్రుచ్చినట్టు ... మీ యింట్లోనే వుంటున్నాడటగా ...

సోమ:—ఉంటున్నాడు లెండి ... పాపం మహాపెద్ద దెబ్బల్లే వుందే. నాలాంటివాడికయితే సునాయాసంగా ప్రాణం పోయివుండును ... ఇంతకీ అదెలాగ.

ప్రిన్సి:—(విసుగ్గా) మీ మీనాక్షి నడగండి ... మీతో మహాచెడ్డ చావొచ్చిపడిందే.

సోమ:—ఒచ్చుంటుంది లెండి ... యింతకీ మాకుటుంబం...

ప్రిన్సి:—మీ కుటుంబంసంగతి నాకేం తెలుసునయ్యా చంపుతున్నారు. మీ మీనాక్షి నడగండి ... లేకపోతే ఆ బోకు నడగండి.

సోమ:—అడుగుతానులెండి. మరి మీరూ ...

ప్రిన్సి:—అడుగుతానులెండి. మరి మీరూ ...

సోమ:—వెళ్ళొస్తాలెండి ... (నిష్క్రమణ)

ప్రిన్సి:—నా గొడవలు నేను చూచుకోలేక చస్తుంటే వీళ్ళ కుటుంబాల గొడవలుకూడా చూడాలిట ... ఆగొడవలే యింతవరకూవచ్చాయి (తల తడుముకుంటాడు)

(ఇంతలో ఎటెండరు వస్తాడు)

ఎటెం:—నేను వెళ్ళానండి. వెళ్ళి యిలాక్లాసులో అడుగు పెట్టేసరికీ ...

ప్రిన్సి:—పొమ్మన్నాడా పొగరుబోతూ ?
ఎటెం:—లేదండి. పెద్ద అసిరమ్మంత నోరుచేసుకొని ...
ప్రిన్సి:—కలబడ్డాడా నీతో ?
ఎటెం:—లేదండి. నోటికిరాని ముక్కలన్నీ.
ప్రిన్సి:—తిట్టాడా నిన్ను ?
ఎటెం:—లేదండి. పులిలాగ కుర్చీలోంచి లేచి చేతులూపుకుంటూ, కళ్ళింత చేసుకొని ...
ప్రిన్సి:—నీ మీదొచ్చిపడ్డాడా ?
ఎటెం:—లేదండి ... ఏదో పాఠం చెబుతున్నారండి ... నేనువెళ్ళి ప్రిన్సిపాలుగారు అర్జంటుగా రమ్మన్నారని చెప్పేను.
ప్రిన్సి:—అయితే వస్తున్నాడా ?
ఎటెం:—"స్టుపిడ్. ఇదట్రా నీకు టైము. క్లాసవగానే ఒస్తానని చెప్పు" అన్నారండి. ఆ మట్టుని క్లాసంతా ...
ప్రిన్సి:—"బోకు బోక"ని అల్లరిచేసారేం ?
ఎటెం:—లేదండి ... నన్నుచూసి పళ్ళికిలించీ, సకిలించీ పిల్లి అరుపులూ, కుక్క అరుపులూ, గాడిదరుపులూ ... మా చెడ్డ సిగ్గయిపోయేనండి ... చాకలీదంటయినా వెళ్ళగలనుగాని క్లాసులో అడుగుపెట్టలేనండింక ...
ప్రిన్సి:—మహా చెడ్డ చావొచ్చిపడ్డదే నీతో ... యివన్నీ నిన్నెవడడిగేడ్రా ?

ఎ టెం:—చూశారా? నన్నన్నిముక్కలూ అడిగి యివ్వడిలాగంటున్నారు.

ప్రిన్సి:—షో. రాస్కెల్ ... వాడిపనే నీకూ అవుతుంది జాగ్రత్త.

ఎ టెం:—అయ్యబాబో! నాతరమా అయోగ్యపనిచెయ్యడం?

ప్రిన్సి:—షటప్ ... వెళ్ళి తీసుకురా వెంటనే ...

ఎ టెం:—మళ్ళీ వెళ్ళిందాండి?

ప్రిన్సి:—ఆ!

ఎ టెం:—మళ్ళీ ఆక్లాసుకేనాండి?

ప్రిన్సి:—(చిరాగ్గా) అవున్నా.

ఎ టెం:—క్లాసింకా వదలకపోతేనండీ?

ప్రిన్సి:—అక్కడేవుండి తీసుకురా?

ఎ టెం:—అందాకా యిక్కడే వుంటేనండి?

ప్రిన్సి:—షటప్ ... వెళ్లు ముందవతలకి.

ఎ టెం:—(పైకివెళ్ళి) ... అవతలకి వెళ్లేదాండి? ఆయన్నే తీసుకొచ్చేదాండి?

ప్రిన్సి:—వెళ్ళి తీసుకురారా?

ఎ టెం:—చిత్తం ... ఇప్పుడేనాండి. (నిష్క్రమణ)

ప్రిన్సి:—మహా చెడ్డచావొచ్చిపడింది యీ మతిమాలిన ఎటెండర్లతో ...

(ఇంతలో తిరిగి ఎటెండరు ప్రవేశిస్తాడు)

ఎ టెం:—ఆ బాబే ...

ప్రిన్సి:—వెళ్ళరా అంటే.
ఏకాం:—ఆబాబే వస్తున్నారండి.

(ఇంతలో కుమారశాస్త్రి ప్రవేశం)

కుమా:—(ప్రవేశిస్తూ నిర్లక్ష్యంగా). — నన్ను Dismiss చేసేస్తాడు అవునా? ... ఏమిటి నేనుచేసిననేరం?
ప్రిన్సి:—అవును. నిన్ను Dismiss చేసేస్తాను. నువ్వు చేసిన నేరం నీకే తెలుసును. నన్ను చికాకెత్తించకు.
కుమా:—నాకూ చికాగ్గానేవుంది మీధోరణి ... అదేం తలకి కట్టు కట్టేరు? ... ఎక్కడన్నా పడ్డారా?
ప్రిన్సి:—(కోపం హెచ్చింది) పటప్ ... ఏమీ ఎరగనట్టు మాట్లాడకు. ఇక్కడ నీగూబ కదల్చిస్తే అడిగేవా డుండడు. జాగ్రత్త.
కుమా:—అపనేదో కానివ్వండి. ఆలస్యమెందుకు? ఇదేం కాలేజీ అనుకున్నారా? దొమ్మరివీధి అనుకున్నారా?
ప్రిన్సి:—జాగ్రత్త నాసంగతింకా నీకు తెలియడంలేదు. నా Student days లో నేనే College Captain ని - రౌడీలందరికి మనమంటే హడల్ ... ఎలాంటిగోడైనా యిట్టే దూకేసేవాణ్ణి.
కుమా:—నిన్నకూడా అలాంటిపనేదైనా చేసారేమిటి?
ప్రిన్సి:—నాచేతికింద యిప్పటికీ అరడజనుమంది రౌడీ లున్నారు.

కుమా:—నాచేతిక్రిందా వున్నారు అలాంటివాళ్ళని అరవై మందిని బడితపూజ చేసేవాళ్ళు.

ప్రిన్సి:—ఎవరు వాళ్ళు చెప్పు మీ అందరిపనీ పట్టేస్తాను.

కుమా:—ముందు మీపనిచూసుకోండి...ఎందుకైనామంచిది

ప్రిన్సి:—అదే యెవడి పనయేదీ చూద్దువ్ గాని, **Girl Students** అంటే అంతలోకువగా వున్నారేం నీ లాంటివాళ్ళకి నా రేజీంలో

కుమా:—అదే నేనూ అడుగుదామను కుంటున్నాను మీ రెజీంలో **Girls** అంత చవకైపోయారేం?

ప్రిన్సి:—వాళ్ళ యిళ్ళల్లోనే తిష్ఠ వేస్తున్నావేం?

కుమా:—వాళ్ళని మీగదికే పిలిపించు కుంటున్నారేం?

ప్రిన్సి:—ఎటెండర్ల ద్వారా రాయబారాలు నడుపుతావేం?

కుమా:—ఎటెండర్లని గది అవతల కాపలా పెడ్తారేం?

ప్రిన్సి:—పుస్తకాలూ అవీ సప్లయి చేస్తున్నావేం?

కుమా:—కవర్లలో పెట్టి జీతంరాళ్ళు సప్లయి చేయబోతారేం

ప్రిన్సి:—ఏమిటి నువ్వు పేల్తున్నది?

కుమా:—ఏమిటి మీరంటున్నది?

ప్రిన్సి:—ఒళ్ళు తెలుసుకు మాట్లాడుతున్నావా?

కుమా:—ఒళ్ళు తెలుసుకు మాట్లాడుతున్నారా?

ప్రిన్సి:—ఏం? మళ్ళీ నన్ను తన్నిస్తావా రౌడీల చేత?

కుమా:—అదేమిటది? ఈ అభాండం కూడా నానెత్తిని వేస్తున్నారు? ఎంతకైనా తగుదురు లెండి ఆ!

అయితేయింతకీ తమర్ని రౌడీలు తన్నేసా ? ఏం పెద్ద దెబ్బలేమీ తగల్లేదుగా...

ప్రిన్సి:—ఏం ? ఇంకా పెద్ద దెబ్బలు తగిలించాలని వుందా నీకు ?

కుమా:—ఇంక చాలు Sir దేనికైనా ఒక అంతూ పొంతూ వుండాలి. అబద్ధమాడితే ఆడది చెప్పినట్టుండాలి.

ప్రిన్సి:—మీ "మీనాక్షి" చెప్పినట్టు ... అవునా ?

కుమా:—(కోపంగా) మేష్టారూ! నీచంగా మాట్లాడకండి పెళ్ళాం పిల్లలూ వున్నవాడిని ... ఆవిడలా చెప్పే మనిషే. అయితే నిన్న ఆవిడని మీరన్నమాటలన్నీ యింట్లో చెప్పేవుందును ... మీ వేషాలన్నీ గోడల మీద రాయించును.

ప్రిన్సి:—ఆవిడ నంటే నీకేం అంత పుస్సు ?

కుమా:—నేను ఖచ్చితమైన మనిషిని ... అలాంటి వెవరి నన్నా సహించను తలుచుకుంటే యీ పాటికి కమిటీకి రిఫరుచేసి మీ వుద్యోగం వూడబీకించేద్దును.

ప్రిన్సి:—నీ ఆయువుపట్లన్నీ యివిగో నాచేతిలోనేవున్నాయి. (కవరు తీస్తాడు) ... యిదిగోచూడు ... నీప్రాణం అంతా యిందులోవుంది... ఇదిలాప్పైకిపంపేనంటే... రెండోనిమిషంలో నీపనిసరి...

కుమా:—ఏమిటాకవరు...యిలా యివ్వండీ – ఓసారిచూచు కుంటాను...ఎక్కడుందో నా ప్రాణం ?

ప్రిన్సి:—అమ్మనాయనే! పుచ్చుకొని చింపేద్దామని కాదూ ...ఎందుకు అవసరమైనప్పుడన్నీ బయటపడతాయిలే ...మనరంకులు.

కుమా:—నా కలాంటి రంకులేమీ లేవు...ఆవున్నవన్నీ తమ దగ్గరేవున్నాయి. మన మేం ఒకళికి భయపడాల్సిన వాళ్ళంకాము.

ప్రిన్సి:—సరే... సాయంత్రానికి నీవుద్యోగం వూడబీకక పోతే నేనుప్రిన్సిపాలునేకాను.

కుమా:—నా ఉద్యోగం ఊడ బీకించితే మీకాలేజీబంద్ చేయించకపోతే నేను కుమారశాస్త్రినే కాను...మరి యీవేళకి నా క్లాసులులేవు ... యింటికే పోతాను.

(నిష్క్రమణ)

ప్రిన్సి:—తెలుగు మేష్టరికింత పొగరుండడం ఎక్కడా చూడ లేదు. అందులోనూ నా రెజీంలో యిలాంటివాళ్ళా... ఎటెండర్! ఎటెండర్....ఇంతపొగరుబోతుతనమా— వీణ్ణి Dismiss చేయించి తీరుతాను.

ఎటెం:—ఇక్కడేవున్నానుసార్ – నేనేం తప్పుచేసాను ... ఎక్కడికీ వెళ్ళలేదండి.

ప్రిన్సి:—ఇంతపొగరా వీడికి ?

ఎటెం:—లేదండి ఇక్కడే వున్నానండి.

ప్రిన్సి:—(తేరుకొని) ఒరేయ్! Head గుమాస్తాగారినో Dismissal order draft చేయమను.

ఎటెం:—తప్పయిపోయిందండి. క్షమించండి.

ప్రిన్సి:—అయిపోతుందిరా తప్పా! అయిపోదూ? ... ఇన్నాళ్ళూ చేస్తున్నపనిదా?...నా రెజీంలో యిలాంటి ఛండాలపుపనులా ... వీళ్ళయిలాఅయితే కుర్రాళ్ళు కాలేజీఅంతా కాల్చి పారేయరూ?

ఎటెం:—తప్పేనండి...ఇదేతొలిసారండి.

ప్రిన్సి:—వెళ్ళూ! ముందు draft రాయమనూ ఊఁ!

ఎటెం:—ఇంకెప్పుడూ వరండామీద చుట్టకాల్చనండి ... లంకపుగాకని యేదో భ్రమపుట్టీ....తప్పేనండి.

ప్రిన్సి:—మహా చెడ్డచావొచ్చిందిరా నీతోనూ...

ఎటెం:—(తేరుకొని)...చిత్తం

ప్రిన్సి:—అదికాదురా? ఆబోకుని Dismiss చేస్తున్నట్టు వ్రాయమనరా?

ఎటెం:—ఎవర్నండి?

ప్రిన్సి:—పెద్ద గుమాస్తాగార్నిరా!

ఎటెం:—ఆయ; నే కాఫీకో వెళ్ళేనండి?

ప్రిన్సి:—చిన్నగుమాస్తాగారిని రాయమను.

ఎటెం:—చిత్తం. ఒకవేళ ఆయనగాని జీతాలు పుచ్చుకునే దగ్గరుంటేనండీ?

ప్రిన్సి:—మహా చెడ్డచావొచ్చిందిరా నీతోనూ? ... ఎక్కడున్నాసరే ... తెలిసిందా?

ఎటెం:—తెలిసిందండి (రెండడుగులు వేస్తాడు) సార్! ఎవరి Dismiss order అండి.

ప్రిన్సి:—(చికాకు) ఎవడిది? నీది ... నీ తాతది ... వెళ్ళు. బోకు మేష్టరివని చెప్పు.

ఎటెం:—ఎందుకు అని అడిగితేనండి?

ప్రిన్సి:—ఏదో ఒకటి రాయమను.

ఎటెం:—అలా నేను రాయలేనంటేనండి?

ప్రిన్సి:—Dismiss చేస్తానని చెప్పు.

ఎటెం:—చిత్తం ... అలాగేనండి (రెండడుగులు వేస్తాడు. లోపుకి పోయి వెంటనే వచ్చి) అయితే సార్! కారణాలేం రాయమంటారండి?

ప్రిన్సి:—మహా చెడ్డచావొచ్చిందే నీతోనూ ... Girls తో చెడతిరుగుళ్ళు తిరుగుతున్నాడని ... సరిగ్గా అధికారుల మాట వినకుండేదనీ ...

ఎటెం:—తమర్ని దారికాసి కొట్టేరనీ,

ప్రిన్సి:—నోర్మూయ్! అవెవడన్నా చెప్పుకుంటార్రా?

ఎటెం:—మరిందాక ఆయనగార్నే అడిగేసేరు కదండి?

ప్రిన్సి:—మహా చెడ్డచావొచ్చిందిరా నీతోనూ ... ఒరేయ్! నువ్వెక్కడికీ వెళ్ళొద్దూ ... యిక్కడేవుండు ... ఎవరేనా వస్తే అలా కూర్చోమను ... నేనలా Rounds కొట్టి, Staff ని కూడా అడిగి ఏదో తేల్చుకుని యిప్పుడేవస్తాను .... (నిష్క్రమణ)

(ఇంతలో గదిఅవతల అడుగులచప్పుడు)

(ఎకౌంటెంటు యీలోగా ప్రిన్సిపాలుగారి టేబిలు యావత్తూ చక్కబెడుతుంటాడు ... పుస్తకాలూ కాగితాలూ సర్దుతూవుంటాడు... ఇంతలో ఆకుపచ్చ వుత్తరంవున్న కవరు కనబడుతుంది ... పైనున్న ఎడ్రసు "మందబుద్ధుల సోమప్పశాస్త్రిగారికి......" అని చదువుతాడు. లోపలభోగట్టా పరిశీలిస్తాడు...)

(గది అవతలనుంచి "Sir" అని కేక)

ఎకౌం:—ఎవరది ?

సింహాం:—(పైనుంచి) నేనండి ! Ham నండి. II year

ఎకౌం:—ఒకనిముషం అవతల వుండండి ... అర్జెంటుపనులున్నాయి.

సింహాం:—అలాగేనండి ... కాని కొంచెం అర్జెంటుసార్ !

ఎకౌం:—(కోపంగా) ఎవరో లోపలికిరండి ... (సింహం లోపలికివస్తాడు) మీరా ? అలాకూర్చోండి ... Principal గారు వస్తారు.

సింహాం:—నువ్వా యింతవరకూ సమాధానాలిచ్చింది ... ఏడీ ప్రిన్సిపాల్ ఏడీ ? ... ఎక్కడకు వెళ్ళాడు ?

ఎకౌం:—మీతో చెప్పమనలేదుగానండీ ! డిస్మిస్ ఆర్డరు రాయించడానికి సలహాకి వెళ్ళారు. మిగతా Staff ని అడగడానికి.

సింహాం:—ఏం ? ఎందుకూ డిస్మిసలూ ? – ఎవర్ని ?

ఎకెం:—తెలుగు లెక్చెరరుగారినండి ... ఆడపిల్లలతో చెడుతిరుగుళ్ళు తిరుగుతున్నారట ... తనమాట వినడంలేదట.

సింహాం:—పైనెలా తిరిగితే వీడికేం? వీడిగదిలో జరిగే గొడవలకంటేనా? ... రానీ! అన్నీ అడుగుతాను. మనం వేసేప్రశ్నలకి గుమ్మయిపోయి అలాప్రాణాలు విడిచేయాలి?

ఎకెం:—అంతపనీ ఆయిందండి. అప్పుడే యెవరో బుర్ర బద్దలుగొట్టేరు, నిన్నరాత్రి.

సింహాం:—అయ్యో పాపం! ఎవరు కొట్టిందీ తెలిసిందేమిటయ్యా.

ఎకెం:—లేదండింకా ... తెలుగు లెక్చెరరుగారే కొట్టించి వుంటారేమోనని అనుకుంటున్నాం.

సింహాం:—పోనీలే ... ఆ గొడవలన్ని మనకెందుకు?

(ఇంతలో ప్రిన్సిపాలుగారు వస్తారు. సింహాంలేచి నిలబడతాడు)

ప్రిన్సి:—ఏం? ఎవరబ్బాయ్ నువ్వు ...? ఏమిటికావాలి?

సింహాం:—T. C. యిప్పిస్తారూ? యింకో కాలేజీకి పోవచ్చు లేకపోతే చదువే మానుకోవచ్చు.

ప్రిన్సి:—ఎవరయ్యా నువ్వసలు? ఏ క్లాసు? ఏ T. C. ఎందుకు?

సింహం:—నేనాండి? నాపేరు సింహమండి? Ham అంటారు.
మీనాక్షన్న అమ్మాయిని తమకు బాగా తెలుసునుగా?

ఎటెం:—మీనాక్షమ్మంటే నిన్న తమరు నన్ను పిలుచుకు రమ్మన్న అమ్మాయండి.

ప్రిన్సి:—నాకు తెలుసు ... నువ్వెపో అవతలకి
(ఎటెండరు నిష్క్రమణ)
అయితే యింతకీ క్లాసొదిలీసి యెందుకొచ్చావ్ ?

సింహం:—T. C. కోసం వచ్చినప్పుడూ క్లాసొదలకూడ దాండి ?

ప్రిన్సి:—సరే! అయితే ఆమీనాక్షి ఏమిటంటుంది ?

సింహం:—ఆమీనాక్షి మామేనమామగారి కూతురండి !

ప్రిన్సి:—మంచిదే. అయితే ఏమంటావ్ ?

సింహం:—ఆవిడ T. C. యిచ్చీయమంటుందండి.

ప్రిన్సి:—ఆవిడ T. C. నీకెలా యిస్తానూ ? ఆవిడనే రమ్మను.

సింహం:—ఆవిడెలా వస్తుందీ ? యింతవరకూ మీరు గొడవలు పెంచేక ?

ప్రిన్సి:—ఏమిటా గొడవలు ?

సింహం:—మీ రోసారి మీనాక్షిని మీగదికిపిలిపించలేదూ? పిలిపించి నానా మాటలూ అనలేదూ ? ... సంసారుల పిల్లల్నదేనా మీకాలేజీలో చేసే మర్యాద ?

ప్రిన్సి:—తను మహా మర్యాదగా తిరుగుతుందీ ? ... మేం మర్యాద చేసేంకాదు ... అవునా ? తనక్కావలసిన వాళ్ళ నింట్లోనో వుంచిందిగా.

సింహం:—Sir, కొంచెం ఆలోచించి మాట్లాడండి నోటి కొచ్చినట్టు అంటే పద్ధేపకం కాదిది.

ప్రిన్సి:—నువా చెడ్డచావొచ్చింది నీతో బోసు మీ యింట్లో నే వుంటున్నాడా ? వాడి ప్రవర్త నెలాటిది ? ... ఏమన్నా తెలుసుకున్నావ్ ?

సింహం:—అవును మా యింట్లోనే వుంటున్నాడు యోగ్యుడని మామామయ్యే అన్నాడు చాలా మంచివేస్తారు

ప్రిన్సి:—నీతో వాదమెందుకు ? బోసు మంచివాడు కాడు **Insubordniation** యీ వేళే **dismissal order** పంపుతున్నాను. వాడ్ని **dismiss** చేసి తీరుతున్నాను.

సింహం:—క్లాసులో ఆయన్నెంత అల్లరిపెట్టినా మా అందరికీ ఆయనంటే గౌరవం లేకపోలేదు **Sir,** ఆయన్ని **Dismiss** చేస్తే **Strike** చేసి తీరతాం.

ప్రిన్సి:—నిన్నిలా చెప్పిరమ్మని పంపేడా మేష్టరు ? ఇంక యీ అల్లరి కూడా మొదలు పెడుతున్నాడేం ? ... కాని మ్మను దీని అంతేదో తేలాలి ?

సింహం:—ఎటు తేల్తుందీ తర్వాత చూడొచ్చును లెండి, ముందు మీనాక్షి TC

ప్రిన్సి:—ఏం యింకిక్కడ చదవదా ?

సింహం:—మీ రెజింలో చదవదు

ప్రిన్సి:—చదువు మానేస్తుందా ?

సింహం:—ఎందుకు మానాలీ? ఇంటిదగ్గరే చదువుకుంటుంది

ప్రిన్సి:—అవును మేష్టారింట్లోనే వున్నాడుగా ?
సింహాం:—మీరిలా గొడవపెడ్తే యివి చాలాపరకు వెళ్తాయి
సార్ ! TC యిచ్చీయండి.
ప్రిన్సి:—ఆవిడ నేరమ్మను
సింహాం:—ఆవిడ రాదు
ప్రిన్సి:—నీకు నేనివ్వను.
సింహాం:—మీరిచ్చితీరాలి.
ప్రిన్సి:—ఇవ్వను.
సింహాం:—ఇవ్వాలి.
ప్రిన్సి:—ఆవిడ నడగమను.
సింహాం:—అడగదు. ఇదిగో అప్లికేషను.
ప్రిన్సి:—సరే. యిదీ వాడు మప్పించేనా ? యింక యింట్లోనే వుంటాడు పూరాగానూ ఉండబ్బాయి. ఆవిడ T.C నీ టీ. సీ. కూడా యిచ్చేస్తున్నాను.
సింహాం:—నా T. C. అడగలేదు.
ప్రిన్సి:—నువ్వడగక్కరలేదు. ఇచ్చేస్తున్నాను. నీటిసితో పాటు Dismissal order కూడా పట్టుకుపోయి యిచ్చేసేయ్ ఆ మేష్టరికి, మీ మేష్టరికి.
సింహాం :—నేనేం ఎటెండర్నికాను. మీ గాయబారాలు మోయడానికి ?
ప్రిన్సి:—ఎటెండర్ ! ఎటెండర్ ! (ఎటెండర్ 'సార్' అని ప్రవేశం)

ఎటెం:—సార్ !

ప్రిన్సి:—ఈ అబ్బాయి T. C. యిచ్చీమను - వ్రాయించి పట్టుకురా.

సింహాం:—నా T. C. కాదు.

ఎటెం:—ఎవరి T. C. అండి ?

ప్రిన్సి:—నీకెందుకవన్నీ. అందరివీ యిచ్చేయమను ... యీలోగా Dismissal order కూడా...

ఎటెం:—ఈయన్నీ Dismiss చేసేస్తున్నారేంటండి ?

ప్రిన్సి:—వెళ్ళుముందు.

ఎటెం:—ఎవర్ని రాయమనీదండి ? పెద్దగుమాస్తానా ? చిన్న గుమాస్తానా ?

ప్రిన్సి:—ఎవడోన్నే ఒకణ్ణి.

ఎటెం:—ఇద్దరూ లేకపోతేనండి ?

ప్రిన్సి:—ఆపు స్తకాలిలావట్రా

ఎటెం:—ఎందులోవుంటాయండి ?

ప్రిన్సి:— నీ వల్లకాట్లోనూ - మహాచెడ్డ చావొచ్చిపడ్డది.

సింహాం:—సార్ ! అడగడం మరిచిపోయానూ ... తలకేం కట్టేరూ ?

ప్రిన్సి—నీకూ కావాలొచ్చిందా పరామర్శ ? అవతలకి పోయికూరోచ్చ ... అన్నీ పట్టుకుపోదూగాని.

సింహాం:—ఇక్కడుంటేనేమండి అందాకానూ ?

ప్రిన్సి:—వీల్లేదు. నాకు చాలాపనుంది.

సింహాం:—ఎవరినైనా పిలిపిస్తారా ?

ప్రిన్సి:—ముందవతలకినడు.

సింహాం:—T. C. లు యిచ్చేస్తే ఏకంగా నడిచేస్తాను.

ప్రిన్సి:—వీల్లేదు. ముందవతలకి నడు.

సింహాం:—వీల్లేదు. ఇక్కడే కూర్చుంటాను (ఇంతసేపూ నుంచొన్నవాడల్లా కుర్చీలో చతికిలబడతాడు) ఇంకెలాగా T. C. యిచ్చేస్తారుగా.

ప్రిన్సి:— కుర్చీలోంచి లే

సింహాం:—ఎందుకు సార్ ?

ప్రిన్సి:—అవి నీకొక్కడు ... పెద్దమనుష్యులకి.

సింహాం:—నాకంటేనా ?

ప్రిన్సి:—Get out—. ఏమ్ ! ఎటెండర్ ! ఎటెండర్ !

సింహాం:—(లేస్తూ) ఎందుకు నే నే లేస్తాలెండి ... వాడికెందు కాశ్రమ. వాడితో యెందుకు అధర్మయుద్ధం ... పైనుంటాను. T. C. పంపించండి. (నిష్క్రమిస్తాడు)

ప్రిన్సి:—నా రెజీంలో యిన్ని ఘోరాలా ? ... మహాచెడ్డ చావొచ్చిపడ్డది వీళ్ళతో.

– తెర –

# బ్రహ్మముడి

## అయిదవ రంగము.

[ సోమప్పశాస్త్రిగారిల్లు — 1, 3 రంగాలలానే గది అలంకరణ. పిల్లలు చదువుకో లేగది. ]

కుమా:—నిన్నరాత్రెవరో అతన్ని చిదగ్గొట్టారట కూడాను ఆ అభాండంకూడా నానెత్తినే వేయబోయాడండి.

సోమ.—వేయబోతాడులే ... అహహా అదికాదు నేననేది ... వెర్రివాడు గాని తెలుగుమేష్టరెక్కడయినా Principal ని కొట్టగలడూ? – పిల్లల్నే అదుపులో పెట్టుకోలేడుగాని ...

గిరి:—ఎందుకదుపులో పెట్టుకోలేరూ. కవిత్వం అంతా ఒలకబోసి వాళ్ళని టోపీలో వేస్తారుగాని.

సోమ:—వేస్తే వేస్తారులే ... అహహా ... అదికాదు నేననేది ... యిప్పుడు కవిత్వానికి లొంగే పిల్లలెక్కడేడిచేరు.

గిరి:—ఎందుకూ? అక్కయ్యనడిగితేసరి అక్కయ్యే చెబుతుంది.

సోమ:—చెబుతుందిలే ... అయితే యింతకీ యేమంటుంది?

కుమా:—నేనీయింట్లో తిష్టవేసానట...మీపిల్లలకి పాఠాలు చెబుతున్నానట – ఇదంతా మంచిదికాదట,

గిరి:—అవునతనన్న దానిలో తప్పేముంది? ... యీయింట్లో తిష్ట వేయడంలేదా? ... యీయింటి సౌకర్యాల కోసం ఎన్నాళ్ళయి చూట్టంలేదూ?

సోమ:—చూస్తున్నారులే. అహాహ అదికాదు నేననేది. ఆయనేం ప్రయత్నం చేసాడూ? నేను పబ్లీగ్గా రమ్మన్నాను. ఆయన పబ్లీగ్గా వచ్చాడు.

గిరి:—వచ్చారులెండి ... కానీ యింత పబ్లికు వ్యవహారం అవుతుందనుకున్నారేమిటి?

సోమ:—అనుకున్నారేమిటిలే ... యెవరుమాత్రం? ఏమిటిప్పుడు జరిగిన మహానేరం? నాయిష్టంమీద రమ్మన్నాను. ఆయనిష్టంమీద వుంటున్నాడు.

కుమా:—తను College లో చదువుకునే రోజుల్లో కాడీలందరికీ తినంటే హడలట- ఎంత యెత్తుగోడైనా యిట్టే దూకేసేవాడట ... నిన్నకూడా యేగోడో దూకబోతేనే ఎవడో వేసుంటాడు.

గిరి:—అలా అనకండి మేష్టారూ! నిన్న ఆసందుమొగని మనకే తగులునేమో అవన్నీనూ ఓపది నిముషాలు ముందయిపోయేంగాని.

సోమ:—ముందయిపోతేనేంలే ... అదికాదు శివుడి ఆజ్ఞలేకపోతే చీమైనా కుట్టదు అన్నారులే పెద్దలు.

కుమా:—తను నానా గొడవానట తన Room కి Ladies ని పిలిపించి నానా మాటలూ అంటాడట.

గిరి:—నయమే మిగతా పెద్దమనుష్యులయితే జీతంరాళ్ళే వాళ్ళ మొఖాన పోసుందురు.

కుమా:—అదిమాత్రం కాదని ఎవరంటారు ?

అలాంటి ప్రబుద్ధులూ వుంటారు ?

గిరి:—[వీడిని కాదన్నట్టు ఎలా మార్చేస్తున్నాడో] Text లిచ్చీ వుత్తరాలు వ్రాసీ రాయబారాలు నడిపీ.

కుమా:—అంతే కాదబ్బాయ్ ! ఎంతకేనా తగిన వాళ్లుంటారు.

గిరి:—[ఎంతకేనా తగిన వాడివేన్రా నువ్వు] ఎటండర్ల చేత రాయబారాలు మోసీ.

కుమా:—అంతేనా అబ్బాయ్ ! గుమ్మం అవతల కాపలా పెట్టీ ... ఓహ్! యింకా చాలా గొడవుంటుందిలే... కుర్రవాడివి.

సోమ:—కుర్రవాడివి నువ్వూరోకో అలాపో అవతలకి.

గిరి:—ఎందుకూ చదువుకుంటాను లెండి. (Text తీసి "రాకేందు బింబమై రవిబింబమై యొప్పు" అనేపద్యం చదవ సాగాడు.)

కుమా:—అయ్యా ! ఏం నీలాపనిందలు వేస్తాడో అని భయంగావుంది. కథలిస్తే అల్లేస్తాడు. ఎందుకేనా మంచిది. మళ్ళీ ఆ సంపెంగా లాడ్జికే పోతాను.

సోమ:—పోదువుగానిలే. అహాహా అదికాదు నేననేది ... నేనుండగా నీకేంభయం— ఏమంటే పేలుకోనీ.

గిరి:—(చదువాపి) పోనీ! ఆయనలా అంటుంటే వెళ్ళిపో నీండి నాన్నగారూ.

కుమా:—అదికాదండి ... ఇంకెలాగా వుద్యోగం వూడ బీకేస్తానంటున్నాడు. ఇంత పెద్దగకులు నాకనవసరం.

సోమ:—అనవసరమైతే కానీయ్ లే. అహహా అదికాదు. వాడుద్యోగం తీయించేస్తే నే నింకోదగ్గర వేయి స్తాను ... నువ్వెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు.

గిరి:—ఆయనకి గదులు పెద్దనయిపోయాయంటే మీరుద్యో గం వేయిస్తానంటారేం? ... ఇంకా ఆకుటుంబం బావొస్తే మరి అతని కేగదిస్తారు?

సోమ:—నీగదిచ్చేస్తాలే ... అహహా - యిక్కడే వుండ వయ్యా పిల్లలికి పాఠాలు చెబుతూను. యీలోగా గవర్నమెంటు వుద్యోగం ఫస్టైనది వేయిస్తాను ... అయితే యింతకీ మా కుటుంబం సంగతేం తెలియ లేదూ నీకు?

కుమా:—ఏకుటుంబమండి?

సోమ:—మావాడయ్యా నా భార్యా మేనల్లుడు బోడసకుర్రు కుటుంబం - ఫస్టియరు చదువుతున్నాడట.

కుమా:—ఏదండీ! భోగట్టాచేయడాని కవకాశమిస్తేనా యీ పిసినిపాలు?

గిరి:—ఏదీ- ఆయనకి తీరుబడేదీ? పిల్లలకి పాఠాలే చెబు తారా? భోగట్టాలే చేస్తారా?

సోమ:—అప్రసవ్వను. ఏదీ నిన్ననేగా మీకు తెలిసింది. యీలోగా యీచిక్కుల్లో పడ్డారు. పోనీ ఆ ప్రిన్సి పాలుకైనా బుద్ధి వుండొద్దూ? మాకుటుంబం గోడ వేమీచూసారు. కాదంటే తన కాగోడ వేమీ అక్కర్లేదట. మీనాక్షినే అడగమంటాడు— ఆడ పిల్ల నలుగురిలోనూ పడి "మా కుటుంబం బావేడి" అని అడుగుతుందా పీడి కామాత్రం యింగితం లేక పోయిందేం?

గిరి:—[మహా యీయన కున్నట్టు అమ్మాయి ఆటలేమన్నా చూస్తేనా యీయన]

సోమ:—కుక్కలా మీదపడి గదిలోంచి వెళ్లగొట్టాడు. ఇదెలానూ పైవాళ్లకి తెలియజేసి తీరతాను.

కుమా:—పోనిద్దురూ. ఇంకా చెప్పాల్సొస్తే చాలా గొడవ లున్నాయి.

(వీధిలోంచి "సార్" అని కేక)

సోమ:—సార్ ఎవడు? ... ఇలా లోపుకి రండెవరో.

ఎటెం:—(ప్రవేశించి) నేనండి ... కాలేజీ ఎటెండర్నండి.

గిరి:—ఇంకా నీ పనేముందిక్కడ.

ఎటెం:—కాదండి ... నాకు నోరు రావడంలేదు. యింత ఘోరం చేస్తారనుకోలేదు.

సోమ:—అనుకోలేదులే ... అసలింతకీ ఏమైందోయ్?

ఎెం:—మరి నా నోటంట చెప్పించకండి. గున్నాళ్ళ సర్వీసుండిగాని ఎన్నడూ యిలాంటిఘోరాలు జరగ లేదు.

రిగి:—[ మేష్టారే యేదో చేసుంటాడు ]

ఎెం:—ఇంతఘోరమా ! ఇంతఘోరమా !!

గిరి:—[అనుమానం లేదు. మేష్టారే యేదో జులాయిపని చేసుంటాడు]

సోమ:—ఘోరమే ... అసలేం జరిగిందోయ్ ?

ఎెం:—ఏమని చెప్పనండి... మేష్టార్నే అడగండి. ఆయన కంతా తెలుసును: అసలలా యిద్దరూ కలబడకపోతే యేమీలేకపోనండి.

గిరి:—[ఇంకేం మేష్టారే యెవరితోనో కలబడినుంటాడు]

సోమ:—ఏమీలేకపోనులే ... అహాహ అదికాదు నేననేది. కలబడితే ఏమైంది ?

ఎెం:—ఏమవడమేమిటండి ? కొంప కూల్చేసేరండి.

సోమ:—(నీకొంపకూల్చా) కూల్చేసెరులే...అదికాదు ఎవడి కొంప ? ఎవరు ?

ఎెం:—ప్రిన్సిపాలుగారండి. మేష్టార్ని డిస్మిస్ చేసేసారు. మహాయోగ్యుడండి పాపం...యిదిగోఆర్డరు(యిస్తాడు)

గిరి:—నీకూ యోగ్యుడేనా. యీమేష్టారిభాగోతం పిళ్ళ కెవరికీ తెలియనట్టు మాట్లాడతావేం ?

కుమా:—నన్ను Dismiss చేసేస్తానని యింతాకే చెప్పాడులే

సోమ:—చెప్తావులే ... చెప్పమాపరి ? – నా అంతవాణ్ణి భోగస్త్రాకు వెళ్తే కసిరిపొమ్మన్నవాడు నీ వుద్యోగం తీసేయడంలో వింతేముందీ ? సరే, కానిమ్మను. వాడు తీసే స్తే నేను వేయిస్తాను.

ఎబెం:—పోనీలెండి యీాయన వుద్యోగం తీసేస్తే తీసేసేరు ఆయమ్మేం తప్పు చేసింది ? హేంగారేం తప్పు చేసారు ? వాళ్ళిద్దరి టీసీలు యిచ్చేసి పొమ్మన్నారు?

కుమా:—వాళ్ళేం చేసారు ? వాళ్ళ నెందుకు పొమ్మనాలీ ? ... ఇదేదో యీాయన కిడుమూాడే చేస్తున్నాడీ పనులన్నీను.

గిరి:—[వీడినుంచే వచ్చింది దంతానూ] మీా గొడవ లెంత వరకూ వచ్చాయో చూడండి మేస్టారూ.

సోమ:—వస్తాయిరా ? రావూామరి ? ఖచ్చితమైన వాళ్ళంటే ప్రతీవాడికీ మొత్త బుద్ధేనూ పిళ్ళకి Tc ఎవడిమ్మి న్నాడు ?

కుమా:—ఏదో కథ అల్లడానికే యిలా చేసుంటాడులెండి ఏం సందేహంలేదు ? ఎందుకైనా తగ్గవాడేనూ.

గిరి:—[గొప్పటోపీ అల్లేస్తున్నావురా నాన్నగారికీ] కాదూ మరి మీా కాలేజీ వ్యవహారాలూ నడతలూా అన్నీ అవే బైట పడతాయి లెండి వాటంతటవేను.

ఎబెం:—సా . . సా . . సార్ ! నాకు నోరు రావడంలేదండి. ఏమనడగాలో తెలియడంలేదండి. నోరు రావడంలేదు సార్.

గిరి:—అదేవస్తుందిలే...ఇంకేమిటి జరిగింది నిన్నూ dismiss చేస్తానన్నాడా ?

సోమ:—అంటాడులే...నన్నే తూలనాడినవాడు

ఎవెం:—అదికాదండి ... యిలాంటప్పుడు నేనే మొఖం పెట్టుకొని...

గిరి:—ఏదో ఓ మొహం పెట్టుకొని చెబ్దూ చంపక.

సోమ:—నిన్నూ డిస్మిస్ చేసేసేడా ?...చెప్పు కలక్టరుతో మాట్లాడి వుద్యోగం వేయిస్తాను. వీడికాలేజీయేనేం టుంది. నీకు మహాగొప్పకాలేజీ ?

ఎవెం:—కాదండి ... నాకు నోరు విప్పడానికి చాలా యిదిగా వుందండి ... అసలేమని యీ మొహం పెట్టుకొని మేష్టరుగారి మొహంచూసి నోరువిప్పమం టారండి ? ... నా ఖర్మకాలి యీ పాపిష్టి చేతుల్తో డిస్మిసార్డరు తెచ్చిందేచాలు ... ఇంకా ఆ గొడ వలు కూడా.

కుమా:—ఏం ? ఏమయింది ... మళ్ళీ రౌడీలూ వాళ్ళూ అంటున్నాడేమిటి కొంపతీసి.

ఎవెం:—కాదండి ... యింకో పదిరోజులు పోయేకయినా Dismiss చేసేరు కాదండి పిల్లలున్నవాణ్ణి.

సోమ:—యిప్పుడైతే నేమయ్యా ! నేను వేయిస్తానుపద. సాయంత్రం వెళ్దాం కలక్టరు బంగళాకి.

కుమా:—చెప్పు. ఫర్వాలేదు. ఏంజరిగింది ?

ఎరె :—కాదండి ... యింకో పదిరోజులు పోతే దసరా కదండి ... ఏవో అలాంటి పండుగలొస్తే మీలాంటి వాళ్ళిట్టినే పోషిస్తారూ ... పిల్లలున్నవాణ్ణి.

గిరి:—ఓరి నీదుంప తెంచ. మాదుంప తెంచావయ్యా.

సోమ:— ఏమిటోయ్! నీకిప్పుడు పండుగ మామూలా? Dismissal Order పట్టుకొనివచ్చి?

ఎరెం:—అందుకనే నేను గారేదం?.

సోమ:—మంచిదే ... యింకట్టే రానివ్వకు.

(ఇంతలో సింహం T. C. లు పట్టుకొని యింట్లోకి వెళ్ళబోతున్నాడు- పిల్లిలా)

గిరి:—చూడండి నాన్నగారూ! సింహంబావ పిల్లిలా గెందుకో లోపుకి పోతున్నాడు.

ఎరెం:—ఏమండీ హేం బాబుగారూ! టీసీలు పుచ్చుకుని యింక మొఖమైనా చూపించలేదూ? ... మీరే అలాగైతే మాలాంటివాళ్ళ మెలా బ్రతకడం?

సోమ:— T. C. లు పుచ్చుకున్నప్పుడూ పుచ్చుకుంటా వటయ్యా నీ మామూళ్ళు?

గిరి:—Dismiss చేస్తేనే పుచ్చుకుంటున్నాడుగా?

సోమ:— ఏమబ్బాయ్! టీసీ లిచ్చేసేడా ప్రిన్సిపాల్? ఏమంత తొందరొచ్చింది?

సింహం:—నేనేం తొందరపడలేదు మామయ్యా ... తీ
యిచ్చేసేదు- నేనేం అతన్నన్నానా చేసానా? ఒకరి
మీద కోపం యింకొకరిమీద చూపిస్తే యెలా?

కుమా:—అందులోనూ బుర్ర చిదగ్గొట్టేసి రేమో? ఆక్రోశంలో
యిచ్చేసి పొమ్మనుంటాడు?

సింహం:—[నామీద అనుమాన పడుతున్నాడేమిటి పీడ]
ఏ రౌడీవెధవలు తన్నేరో చీకట్లో చూచి దారికాచి.

ఎకెం:—అందుకే మేష్టారు మాబాగా చెప్పారు. "నా
కిందా వున్నారు అలాంటి రౌడీలని అరవైమందిని
చిదగ్గొట్టేవాళ్ళ"ని.

గిరి:—[అనుమానం లేదు. మేష్టారే తన్నించి వుంటాడు]

సోమ:—అంటే అంటారు ... ఎంత యిదైనా తెలుగు
మేష్టర్లకి స్వామిభక్తి లేకుండా పోతుందీ? ఉద్యో
గం ఊడబీకినా తన యజమానిని తన్నిన రౌడీలను
చిదగ్గొట్టేస్తానన్న యోగ్యులెంతమంది వుంటారు?
యీరోజుల్లో? ... అయితే సింహం! అంతయిదిగా
చిదగ్గొట్టేస్తారా వట్టినేనూ ?

సింహం:—[చచ్చాను. నామీదే యీయన అనుమానం].
వట్టినే ఎవరు కొడతారు మామయ్యా?

కుమా:—అతను సరియైనవాడు కాడులెండి ... దుస్సహ
వాసాలు వట్టినే పోతాయా? ... చీకట్లో చూసి
చిదగ్గొట్టి వుంటారు.

సింహం:—[ఈయనా నామీదే అనుమాన పడ్తున్నాడు] అతను మహా సరియైనవాడేమిటి లెండి.

గిరి:—[మహా వీళ్ళిద్దరూ సరియైనవాళ్ళలాగ. మేష్టరే పురమాయించి వుంటాడు. లేకపోతే సింహంబావో — ఎవడో ఓ పెద్దమనిషి] మనకెందుకు లెద్దురూ?

ఎలెం:—ఎవడైతేనేం గానండీ మహా బలమైనదెబ్బలు కొట్టేరండి? నాలాంటివాడైతే చచ్చిపోనూ.

సోమ:—చచ్చిపోతే పోనీతే ... అదికాదు ... ఆ పొగరు బోతుకి కాసలసిందే. T. C లు యిచ్చేసేడుగా? యింకేం ఫర్వాలేదు.

ఎలెం:—ఇచ్చేసేరు లెండి T. C లు యింకదికాదు ... దీంతో యెన్నిగొడవ లొస్తాయోనండి?

సింహం:—ఒస్తాయూ, మరీవస్తాయూ? Strike చేసి తీరతారు స్టూడెంట్సు ... అందులోనూ మేష్టార్కి యిలాంటి అన్యాయంజరిగితే ఏస్టూడెంటూ వూరుకోడు.

సోము:—ఊరుకోకపోతే పోనీలే ... నువ్వు Strike లో కూడా చేరేవంటే నేనూరుకునేదిలేదు ... ఎందుకూ? నేను రిపోర్టు చేస్తానులే కమిటీకి - T. C లెందుకు యిచ్చేసేడో - కుటుంబంసంగతడిగితే యెందుకు నన్ను తూలనాడేడో - మేష్టార్నెందుకు Dismiss చేసీసేడో అన్నీ తేల్తాయి.

గిరి:— అదే మనకు కావలసిందీనూ - మన కుటుంబం గొడవేదో తేలి ఓగట్టున చేరితే అదేచాలును. మీ రేమంటే అనండిగాని Strike చేస్తేనేగాని యివేం తేలవు.

కమా:—ఎందుకూ స్టూడెంట్సు చక్కబెడతారు మనకేల?

ఎరెం:—అలాగే - బాగా చెప్పారు. మనకేల యీగొడవ లన్నీను?

గిరి:—అలాగే - బాగాచెప్పేవు. నీకేల యీగొడవలన్నీను పద పద నీనుంచే వస్తున్నాయీ గొడవలన్నీను.

ఎరెం:—అలాగే - బాగాచెప్పేరు - నాకేల యీగొడవ లన్నీను.

గిరి:—అలాగే - బాగాచెప్పేవు! యిక్కడవన్నీ మోసుకు వెళ్ళి అక్కడచెబ్తావా ప్రిన్సిపాలుతో?

ఎరెం:—నాకెందుకు యీగొడవలన్నీను? మీరుచెప్పమంటే చెప్తానా? చెప్పొద్దంటే మాన్తానా?

సింహం:—సరే నువ్వెళ్ళు నువ్వొచ్చిన పని అయిందిగా యిక వెళ్ళు

ఎరెం:—అయిందండి... అసలు నేనిక్కడి కెందుకొచ్చానూ ఆఁ అయిదండీ ... ప్రిన్సిపాలుగారితో ఏమిటి చెప్ప మంటారు?

సోమ:—ఏమీ చెప్పవద్దు వెళ్ళవయ్యా

ఎరెం:—చిత్తం (నిష్క్రమణ)

సోమ:—(కుమార శాస్త్రితో) రావయ్యా నీగదిలోకి పోయి శాస్త్ర ఆన ర్తనశాల ఘట్టం చదివి వినిపిద్దూగాని ... నిన్నెంతవరకూ వచ్చాం? ఆఁ భీముడు బయల్దేరాడు నర్తనశాలకి ... (కుమార శాస్త్రితో నిష్క్రమణ)

సింహాం:—ఆఁ! నేనూ బయల్దేరతాను.

గిరి:—భీముడు బయల్దేరాడు నర్తనశాలకంటే నువ్వెందుకు రా బయల్దేరడం?

సింహాం:—పార్కులో కొంచెంపనివుంది. యీవేళయినా నల్గురితో మాట్లాడి రేపటికి అంతా సిద్ధమయిపోవాలి. యివిగో T. C. లు మీనాకియ్యి యెక్కడేనావుంచ మను. భద్రం-ఏదేనా పెద్దకవరులో పెట్టమను. ఎందుకు T. C. లు యిచ్చేసేరో కనుక్కోవాలి మామయ్యాయినా రేపు?

గిరి:—ఎందుకిచ్చా రేమిటి? బుర్రబద్దలుగొడితే ఎవడు మాత్రం వూరుకుంటాడు?

సింహాం:—ఎవడో కొడితే నా T. C. యెందుకు యిచ్చే యడం? వాడైనా వట్టినేకొడతాడా? ఆప్రిన్సిపా లేదో కొక్కిరాయిపని చేసాడూ?- తిన్నాడూ?

గిరి:—అయితే నువ్వుకాదుట్రా Principal ని కొట్టింది-పోనీ ఆ కొట్టినవాడెవడు?

సింహాం:—ఎవడో ఒకడు నీకెందుకురా? ... నిజంగా నీకు తెలియదట్రా?

గిరి:—ఎవడో ఒకడైతే చెప్పడానికి భయం నీకెందుకురా ?

సింహం:—ఒరేయ్ చెప్తే నీకేముప్పు ?– ఏం తెలియనట్టు మాట్లాడకు–నిన్ను Save చేయడానికే యీ Strike organise చేయిద్దామనుకుంటున్నాను.

గిరి:—నన్ను నువ్వు Save చెయ్యడమేమిటి ?

సింహం:—నువ్వు కాదట్రా కొట్టింది ? మనదగ్గర గక్కీలు కొట్ట కొరేయ్ ! అంతా తెలిసింది మేష్టరుగారూ నువ్వూ ఎక్కడెక్కడికి తిరిగిందీ తెలియదేమిటి నిన్న రాత్రి ?

గిరి:—ఎక్కడెక్కడికి తిరిగాం ? II Show సినీమాకి వెళ్ళి రాత్రొచ్చి ఆయన రూంలో పడుకున్నాం నువ్వు కొడతావని.

సింహం:—నేనెందుకు కొడ్తానూ ? అసలు వాడివి నువ్వుండగానూ ? నీకులేని బాధ నాకుందంటే మాత్రం యెవడు నమ్ముతాడు సరే చెప్తాను Time రానీ ఎవడు కొట్టిందీ ఎక్కడ కొట్టిందీ చెప్తాను. అదే పోయిందని నిన్ను Save చేద్దామనుకుంటుంటే నా మీదే తోసేస్తున్నావ్ ?

గిరి:—అదేపోయిందని వాడిని Save చేద్దామని వెనకవెనకే తిరిగితే నామీదే తోసేస్తున్నావ్ ?

సింహం:—సరే ! నామీదపెట్టు. చెప్పకపోతే చూడు అన్ని గొడవలూను.

మీనా:—చెప్పు. ఆ కాలేజీశని వదిలిపోయింది. చెప్పుకో.

గిరి:—కాలేజీశనిగాడొ్దితే యింట్లో గురుగ్రహం పట్టుకుందిగా- మంచియోగమే ?

మీనా:—ఏమిటా పేలాపన ? నాన్నగారితో చెప్పాలా ?

గిరి:—ఏమిటలా మురిపిస్తున్నావ్ ? చెబితే చెప్పుకో. నువ్వు T. C. తెచ్చుకున్నదిగాక సింహంబావ T. C కూడా యెందుకు తెప్పించావ్ ?- ఏం అతగాడు యింట్లో వుంటున్నాడుగా తోడుగాను ?

మీనా:—తమ్ముడూ ! యిలాంటివాటిలో కలుగజేసుకోకు. మంచిదికాదు.

గిరి:—ఏం నన్నుకూడా తన్నిస్తావా ? మీ వాళ్ళచేత Principal ని తన్నించినట్టు.

మీనా:—(నిందలుమోయలేకపోయింది) మీవాళ్ళెవరురా? నోటికొచ్చినట్టు పేల్తున్నావ్ (లెంపకాయ కొడుతుంది)

గిరి:—వాడిదన్ను చూచుకునేగా నన్నిలా కొడ్తున్నావ్ ? - చూడు వాడి దుమ్ములు విరగ్గొడతాను యీ సాయంత్రానికి. యింట్లోంచి గెంటించి తన్నించకపోతే ఒట్టు.

మీనా:—మళ్ళీ నోరెత్తు.

గిరి:—ప్రేమలేఖలు వ్రాసీ, వాడిగదికి వెళ్తూ, వస్తూ వాళ్ళ వాళ్ళని పురమాయించి Principal ని తన్నించీ,... అమ్మ రాక్షసీ, అమ్మరాక్షసీ ! నేనివన్నీ బయట

పెట్టకపోతే చూడు ... వీళ్ళకి తోడు సింహంగా డొకడా? ... రౌడీవెధవ ... వాడీని కాలేజీలోంచి వూడబీకేస్తే నీకేమే?

మీనా:—ఎవర్ని తీసీసేరూ?

గిరి:—మహా తెలియనట్టు ... ఇంకెవణ్ణి ... నీ బోకుమేష్టర్ని ఓరి గర్ల్‌స్టూడెంటూ్సా ... మీరెంతకన్నా తగుదు రర్రా! ... వస్తాను ... ఆ T. C. లేవేనా కవర్లో పెట్టు – మళ్ళీ నాన్నగారు రేపు జాయిన్ చేస్తా నన్నారు. పద పద. (నిష్క్రమణ)

మీనా:—మేష్టారు నాకు వుత్తరం వ్రాసారంటాడేమిటి నిన్నట్నుంచీ గిరి ... పోనీ ఆవుత్తరమైనా నాచేత పడనిచ్చాడా? ... నేను నమ్మను – మేష్టారు అలాంటిపనులెప్పుడూ చేయడు?

(ఇంతలో కుమారశాస్త్రి ప్రవేశం)

కుమా:—ఏమమ్మా మీనాక్షీ...కాలేజీగొడవలేం విన్నావ్? T. C. కూడా పుచ్చీసుకున్నావట.

మీనా:—ఏం తెలియనట్టు మాట్లాడకండీ మేష్టారూ! సీనియర్ బేచ్ (Batch) వాళ్ళపుస్తకాలేమన్నా సంపాదించి పెట్టమంటే – పుస్తకంలో Letters పెట్టి పంపుతారా? ... యింకా మీరేదో అమాయకు లనుకుంటే ...

కుమా:—యిదో హాటా? యీ నీలాపనిందలుకూడా మోయాలీ!
యింతకీ యివి నా చెడ్డరోజులు ... ఏదీ! ఆవుత్తరం
చూడనీయమ్మా !

మీనా:—అమ్మా! బోమ్మాను ఏంబుద్ధిమంతులండి ?

కుమా:—పోనీ! ఆవుత్తరం చూడనీయ్ మీనాక్షీ.

మీనా:—నాదగ్గరెక్కడుంది అవుత్తరం ?

కుమా:—పోనీ ఏమని రాసానంటావో చెప్పు.

మీనా:—చాల్లేండి యింకా సిగ్గులేక ...

కుమా:—సరేనమ్మా! మీనాన్నగారూ వాళ్లూ అలా
గెక్కడికో వీధిలోకి వెళ్లేరు – మళ్లీ వచ్చేక సంపెంగా
లాడ్జికి వెళ్ళిపోయేనని చెప్పు ... సామానదీ వెంటనే
పట్టుకు పోతున్నాను ... ఒకవేళ అలాంటి వుత్తరం
వ్రాశానని నువ్వూ అనుకుంటూవుంటే నన్ను
క్షమించు ... నే నేదేనా అలావుత్తరం రాసానని
రుజువైతే పిలిపించి నలుగురిచేతా ఎడా పెడా నన్ను
చెప్పుదెబ్బలు కొట్టించు ... సరా! ... నే వెళ్తాను.
(నిష్క్రమణ)

మీనా:—(నొచ్చుకుని, బాధపడి, దుఃఖించి) ... మేష్టారూ!
మేష్టారూ!

– తెర –

---

# బ్ర హ్మ ము డి

## ఆ ర వ  ర ం గ ము.

ప్రిన్సిపాలుగారి ఆఫీసుగది - లోపల అలంకరణ 2; 4 రంగాల వలెనే - కొంచెం కుర్చీల సంఖ్య హెచ్చింది. ప్రిన్సిపాలుగారూ, యింకొక కొత్తవ్యక్తి యీయనే బోడసముద్రం సుబ్బావధాన్లు గారూ వున్నారు. ప్రిన్సిపాలుగారు చిక్కొగ్గా crisis లో వున్నారు. సుబ్బావధాన్లుగారు 50 ఏళ్ళవాడు. తనధోరణి తనది.

గది అవతల అంటే తెరలో కాలేజీకుర్రాళ్ళు కేకలు వేస్తు న్నారు - Strike జోరుగా సాగుతుంది. "కుమారశాస్త్రిగార్ని జాయిన్ చేసుకోవాలీ, కుమారశాస్త్రిగారినీ జాయిన్ చేసు కోవాలీ" అని కేకలు- మధ్యమధ్య ఎవడో పెంకికుర్రాడు బోకు మేష్టరుగారినీ జాయిన్ చేసుకోవాలీ అని కేకలు పెడుతున్నాడు - పిల్లీ, కుక్కా, గాడిదా యిత్యాది జంతువర్గ స్వనాలు, స్వరాలు మధ్యమధ్య- కేకలు నాల్గువేపుల్నించీ.

ప్రిన్సి:—ఇప్పుడు కాదు సార్ ! యీగొడవేదో తేలనివ్వండి తర్వాత కనుక్కుంటాను.

సుబ్బా:— నా ఏడుపేదో కాస్త మీచెవినివేసి యేడవ నివ్వండి సార్ - తర్వాత మీయిది చూచుకో వచ్చునూ ?

ప్రిన్సి:—అంతే నన్నమాట- మీ మాటేమీాదన్నమాట- మహాచెడ్డ చావొచ్చింది మీతోనూ - అవతల Strike అండీ Strike.

సుబ్బా:—పిల్లకాయలు వాళ్ళ ఏడుపేదో ఏడుస్తారు. దానికే యింతైపోతే యెలాగండి- నా ఏడుపేదో కాస్త -

ప్రిన్సి:—అయితే కానివ్వండి ... మహా చెడ్డ చావొచ్చింది ... అస లింతకీ మీరెవరు ?

సుబ్బా:—అలా అడిగేరు బావుంది - సోమప్పశాస్త్రి మా చెల్లెలు మొగుడండి.

ప్రిన్సి:— మీరెవరో చెప్పమంటే మీచెల్లెలు మొగుడు గురించి చెబ్తారేమిటండి ?

సుబ్బా:—అబ్బా! మీయిదేగాని నాయిది వినరేమిటి ? యీవూరివాడని చెప్పేనుసార్ - అయితే మావేపు నుంచే చెప్పుకువస్తాను. నాపేరు బోడసహస్రరు సుబ్బావధాన్లు. Postal Department లో సూపరింటెండెంటు వుద్యోగం. ప్రస్తుతం నివాసం జబ్బలూర్పూర్‌లో ... మావాడొకడూ ...

(ఇంతలో తిరిగి Strike కేకలు)

ప్రిన్సి:—Strike లో వున్నాడా ? చెప్పండి ? పేరుచెప్పండి ? యీ కాలేజీలోంచి యిలాంటి వాళ్ళందర్ని తరిమెయ్యాలి ?

సుబ్బా:—వాడిపేరు మీరు వినేవుంటారు. చాలా ఘనాపాఠీ. కథలూ గట్రా పేపర్లలో వ్రాస్తుంటాడు లెండి. చిత్రగుప్త, ఆనందవాణి, రూపవాణి, జ్యోతీ, చిత్రాంగీ, వినోదినీ, ఛంకా ...

(Strike కేకలు)

ప్రిన్సి:—మీా "ఘంకా" యింక అట్టే వాయించకండి Sir, అవతలా ...

సుబ్బా:—అవతల వాళ్ళలా ఏడిస్తే మనకేంసార్ ! ... ... పత్రికలవాళ్ళు మావాడి కథలకీ వాటికీ పైసా పరకా ముట్టజెప్తుంటారు లెండి ... మాటకి చెబుతానూ ... మావాడూ తన అయిదవపేట భావకవిత్వం మొదలుపెట్టేసరికి ఓనమాలు దిద్దించే మేష్టరు వృత్తం పెట్టుకున్నాడంటే నమ్మండి.

ప్రిన్సి:—నమ్ముతున్నాను. నమ్ముతాను ... ఇంతకీ మీావాడి పేరూ ?

సుబ్బా:—నా ఏడుపు వినరేం ? మావాడి పేరుకేం ... తెలుగు పత్రిక చదివే ప్రతివాడికీ కంఠతా అనుకోండి.

ప్రిన్సి:—నేనేం తెలుగు పత్రికలు చదవనండి.

సుబ్బా:—అద్గదీ ... అలా చెప్పండి ... లేకపోతే మావాడిని తెలియకపోవడమేమిటి ... మాయింట్లో వీడెలాగా పెద్దవాడవుతాడని తెలుసుననుకోండి ... పెద్దా అని చిన్నప్పట్నుంచీ అంటున్నాం.

(Strike కేకలు)

ప్రిన్సి:—అనండిసార్ ! ఎవడొద్దన్నాడూ ? ఇంతకీ ...

సుబ్బా:—మరివాళ్ళ ఏడుపేగాని నాయిది పట్టించుకోరేం... పట్టినే పెద్దా అంటున్నామూ ? ... ఎవరండీ ఆయన

... దైవజ్ఞరత్నా ............ వారూ మావాడి జాతకం చూచీ గురుకుజులు దశమంలో వుండడంచేత యవ్వనంలోనే మినిష్టరుకూడా కావచ్చునన్నాడు?... నేనట్టే చెప్పకూడదులెండి.

ప్రిన్సి:—సరే! అలాగే కానీండి ... మరి నేనలా ఓసారి వెళ్ళివస్తాను ... మీవాడి పేరూ.

సుబ్బా:—అదే వస్తున్నా! మాయింట్లో పెద్దా అంటాం... కథలవీ ఏదో మహాతమాషా అయిన పేరున వ్రాస్తా డండీ! ప్రతివాడికీ జ్ఞాపకమేనూ?

ప్రిన్సి:—మీవాడి పేరు Sir,

సుబ్బా:—మా వంశానికి వీడే ఏకమాత్రుడవడం చేతా మావాళ్ళందరూ కలిసీ ...

ప్రిన్సి:—తర్వాత కలుసుకుందాం Sir,

సుబ్బా:—వస్తున్నా! "కుటుంబం" అని పేరు పెట్టేరండి ... యీ విధాన్నయినా మా వంశవృద్ధి వుంటుందేమో నని ... అందుకనే వాడంటే యింత ఏడుపూను... సరాసరి రైలుదిగి యిలా వచ్చేసేను. మా సోమప్ప యింటికేనా వెళ్ళకుండానూ? ... అయితే యింతకీ మావాడు వచ్చాడా?

ప్రిన్సి:—(పరధ్యానంగా) ... ఎవరండీ? ... ఆఁ వచ్చాడు అతనేకాదూ? ... వచ్చాడు.

(తిరిగి Strike కేకలు. కొట్టు, కొట్టు అని కేకలు)

ప్రిన్సి:—అలా ఆ Strike లో వున్నాడేమో చూడండి, అవధాన్లుగారూ. ఓసారి వెళ్ళిరండి.

(ఇంతలో ఎటెండర్ ప్రవేశము - తెరలోకిచూస్తూ)

ఎటెం:—ఇంక రండర్రా మీసంమీద మూతుండి రోషం వున్నవాళ్ళయితేనూ ...

ప్రిన్సి:—మీసంమీద మూతేమిట్రా ?

ఎటెం:—అదేనండి ... ఎక్కడయితే నేమిటి సార్ ? ... రమ్మనండి ... (కోపంతో) రండ్రా దుమ్ములేరేస్తాను.

ప్రిన్సి:—ఏమిట్రా ? ఏం జరిగిందిరా ? ... అంతలా ప్రళయ తాండవం తొక్కుతున్నావ్ ?

ఎటెం:— Student కుర్రాళ్ళండి. గోడలనిండా నానాచెత్తా రాసారండి. వెళ్ళి చెరిపేసేనండి. నలుగురూ నాలుగు వేపులా పట్టుకొని బజాయించేరండి ... గేటులోంచి వస్తుంటే 'హేం'గారు యింకో ఎర్రటబ్బాయితో "వీడేనూ కానివ్వమన్నాడండి" ఆమట్టుని ఆఅబ్బాయి నాచొక్కా యిలా పట్టుకొని ఛెళ్ళున యీలెంపా ఆలెంపా వాయించి, నేను పారిపోవస్తుంటే వీపు మీద మహాబలమైన దెబ్బ కొట్టేడండి– వాడిచేతులు పడిపోనూ ...

(ఇంతలో సోమప్ప శాస్త్రిగారూ, గిరీవస్తారు ... సోమప్ప శాస్త్రిగారి చేతిలో ఒకపెద్ద కవరుంది. అందులో T. C. లున్ను ఏడుపు వుత్తరం వుండాలి)

సోమ:—పడిపోతే పడిపోవచ్చులే ... అదికాదు నేననేది ... మావాళ్ళకి T. C. యెందుకిచ్చారూ అని ... నన్నెందుకు తూలనాడేరూ అని.

సుబ్బా:—ఓహ్హో! బావగారూ!

సోమ:—అహ్హో బావగారూ.

గిరి:—ఒహ్హోహ్హో మామగారూ!

సుబ్బా:— వీడెవడ్రా యీనాగమ్మ. మహా తెలిసున్నట్టు పలకరిస్తున్నాడు? పోకిరీ ఏడుపూ వీడూనూ?

సోమ:—వీడేలే...మావాడు...మీనాక్షి తర్వాతవాడు – వీడి రెండేళ్ళప్పుడు చూసావ్? వీడ్ని ... అయితే యెప్పుడొచ్చేవ్ ఏమిటి? మీవాళ్ళంతాకులాసా?

ఎటెం:—ఏం? కులాసాసార్! నన్ను స్టూడెంట్సు చిదగ్గొట్టి చేరంటే మీరిక్కడ కుశలప్రశ్న లేమిటి? అవతల Strike.

సుబ్బా:—అదే కులాసా అయ్యా! నీదయవల్ల ఇంతకీ మా కుటుంబంగాడి ఏడుపేదీ తెలియలేదు.

(Strike కేకలు)

ప్రిన్సి:—అవతల Strike ఏమిటీ? మీ కుశల ప్రశ్న లేమిటీ? అయ్యా దయచేసి యింకోసారి మీరు దయచేయండి. మహా చెడ్డ చావొచ్చింది మీతోనూ.

సోమ:— (సుబ్బాతో) ఏదీ యిలా వచ్చినవాడివి యింటికొస్తే అరిగిపోతావ్? నీబుద్ధి పోనిచ్చుకున్నావ్ కాదు– అయినవాళ్లం పూళ్ళో వున్నామా?

ఎటెం:—(ప్రిన్సి-తో) తమరోసారి వస్తే నేగాని లేకపోతే బేఫికరై పోతారండి వాళ్ళ్యా! తమ ఎటెండర్ని నన్నే కొడితే ...

సుబ్బా:—ఏదయ్యా నా ఏడుపు వినవాయెను. ఏదో వారంరోజులు సెలవు పెడితే వాళ్లు సెలవిచ్చేసరికి తలప్రాణం తోకకి వచ్చింది ... ఇలా Mail దిగేనూ— ముందబ్బాయిగురించి వాకబుచేసి యిద్దరం కలిసి వద్దామనేగా నాసంకల్పం.

(Strike కేకలు)

ఎటెం:—వాళ్లు మరి కనబడరు సార్! ఏందెబ్బ కొట్టేసేరండి. యింకోడైతే చచ్చేపోను. తమ ఎటెండర్నే యిలాగ.

సోమ:—సంకల్పమేలే- అది కాదు. మీ వాడి గురించి భోగట్టా చేస్తూనే వున్నానయ్యా, నీవుత్తరం ప్రిన్సిపాలుగారికి యిచ్చేను కూడాను.

ప్రిన్సి:—కొడితే కొట్టేరులే... అయ్యా తమరిద్దరూ మళ్ళీ ఓసారి దయ చేస్తారూ- అవతల Strike.

సుబ్బా:—పిల్లవాడి తల్లిముండ ఒకటే ఏడుపూ ... నన్ను మహా వేడ్పించిందిలే ... యిక చచ్చే చావొచ్చిందని బయల్దేరివచ్చాను

ప్రిన్సి:—ఒరేయ్ ! వీళ్ళగోలే వీళ్ళదిగాని మనమాట వినేట్టు లేరు ... పద ... ఆ ! అబ్బాయిని చూపించు పద పద. (ఎటెండరూ, ప్రిన్సిపాలూ నిష్క్రమణ)

సుబ్బా:—యింతకీ వీడెక్కడేదుస్తున్నదీ చెప్పమంటే యీ ప్రిన్సిపాల్ చెప్పి ఏడవడేంఖర్మం ...

సోమ:—ఖర్మమేలే ... మాకుటుంబంసంగతి చూడండని నిన్నసనగా నిన్ననే అడిగేసరికి నన్ను చాలా తూలనా డేడు ... మాసింహంగాడికీ, అమ్మాయికీ T. C. లు కూడా యిచ్చేసేడు.

గిరి:—అయితే ... ఆ ఏడుపుత్తరం మీారా రాసేరు ? ... అదీ అలా చెప్పండి ... అది చదివితే నాకు మహాచెడ్డ ఏడొప్పొచ్చింది లెండి ?

సోమ:—నోర్మూయ్ ! ... ఎందుకు T. C. లిచ్చేసేడో కనుక్కుందామనే వచ్చాననుకో ... వీళ్ళకి అధికార వినియోగం సరిగ్గా తెలియదనుకో (ఇంతలో తిరిగి ప్రిన్సిపాలు, ఎటెండర్, సింహం, కుటుంబం మీానాక్షీ వస్తారు)

సుబ్బా:—(కుటుంబాన్ని చూచి) ఏరా అబ్బాయి ! మమ్మ ల్నిలా ఏడ్పించడం భావ్యంకాదురా ... రెణ్ణాళ్లయి వచ్చి వుత్తరంముక్కైనా వ్రాశావ్.

సోమ:—ఒరేయ్ సింహం ! మీానాక్షీ ! యితనేనర్రా నా భావమరిది ... మొన్న వుత్తరం వ్రాసాడూ ?

గిరిగాడు నీకుత్తరం యివ్వాలేదటే మీనాక్షీ ...
ఇరుగోనయ్యా మామేనల్లుడూ, అమ్మాయీని ...
వీడు మా గిరిగాడు ...

ఎకెం:—(కుటుంబాన్ని చూపిస్తూ, ప్రిన్సిపాలుతో) ఆయనే నండి నన్ను కొట్టింది ... యింకోకడైతే వెన్ను విరిగిపోను.

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిందర్రా మీతోనూ ... ఏమబ్బాయి. నీకు నా కాలేజీలో చదవాలని లేకపోతే నీ T. C. పట్టుకుపో. అంతేగాని Strike లూ గట్రా నా రెజీంలో పనికిరావు. (ఎకెండరుతో) రాయ మన్నా ఓ T. C. ఏమిటబ్బాయ్ నీపేరు.

కుటుం:—ఎప్పుడొచ్చారు నాన్నగారూ !... ఒరేయ్ సింహం He is my father. నాన్నగారూ వీడుసింహం మా Senior.

సుబ్బా:—ఏడిసావ్ ? వెర్రినాగమ్మ ... నాలుగువందల రూపాయలు ఖర్చుచేసి దుస్సహావాసాలు చేసు కుంటూ.

సోమ:—మా మేనల్లుడయ్యా ! యీసింహం.

గిరి:—నేను వీరి అబ్బాయినండి ... నాపేరు గిరి.

ప్రిన్సి:—నీ పే రెవడడిగాడయ్యా ... అతను ఆ అబ్బాయి !

గిరి:—అతన్నే అడగండి.

ఎటెం:—ఇంకిలా అయితే లాభంలేదుసార్! అందరి టీసీలూ వ్రాయించేస్తాను. అందరిపీ యిచ్చేయండి.

సోమ:—ఇస్తారులే ... అహాహా అదికాదు ... మావాళ్ళ T. C. లు యెందు కిచ్చేసేరో కనుక్కుందామనే వచ్చేను. మా మేనల్లుడి గొడవడిగితే నన్నెందుకు తూలనాడేరో అడుగుదామనే వచ్చాను! ... ఏం సార్! మాట్లాడరేం?

(Strike కేకలు)

(ఇంతలో కుమారశాస్త్రిగారు వస్తారు)

కుమా:—(ప్రిన్సిపాలుతో) ... అంత బాగానే వుందిసార్! నాజీతం పదిహేను రోజులది వస్తుంది. Dismiss చేసేరు సరే. ఆజీతం యిప్పించేయండి ... నోటీస్ లేకుండా Dismiss చేసేరదేపోయింది. జీతమన్నా యిప్పించండి.

గిరి:—[ఓరి రాక్షసా! యింత గొడవా తెచ్చి యింకా జీతం కావాలీ నీకు.]

సోమ:—ఇప్పిస్తారులే ... అహాహా అదికాదు నేననేది ... గదులు ఖాళీచేసి వెళ్ళిపోయావేమయ్యా నాతో చెప్పనన్నా చెప్పకుండానూ?

కుమా:—ఏదండి. టైము లేకపోయింది. క్షమించండి ... రెండు రోజులకీ తమకి అద్దె యెంతొస్తుందండి?

సుబ్బా:—ఈయ నెవరయ్యా.

కుమా:—నేనాండి ?...యిక్కడ తెలుగులెక్చెరరుగా పని చేసాను. కుమారశాస్త్రి అంటారండి...బోకు అని కూడా అంటారులెండి (తెరవెనుక Strike కేకలు)

కుటుం:— యీ వేళ్టినుంచి మిమ్మల్ని పేరున పిలిచేవాణ్ణి యీ కాలేజీలోంచి తరిమేస్తాం సార్ !

సోమ:—(కుమారశాస్త్రితో) వీడేనయ్యా మావాడూ... కుటుంబం. వీడిగురించే నిన్న మీతో చెప్తా...అయ్యా! ప్రిన్సిపాలుగారూ, వీడిగురించి అడిగితేనే యింత హడావుడిచేసి నన్ను నిందించేరు ... మా కుటుంబం అంటే వీడేనూ !

గిరి:—నాన్నగారూ ! అసలువచ్చిన సంగతి మర్చిపోతు న్నారు. ఆ T. C. ల సంగతి అడగండి.

సోమ:—అడుగుతానులే ... అహాహా ఆదికాదు నేననేది ... (కవరు తీస్తాడు. T. C. లు వాటితోపాటు ఏడుపు వుత్తరం వస్తాయి) యివిగోనండి టీ. సీ. లు ఇవి ఎందుకిచ్చారు. మావాళ్ళకి ... నన్నెందుకు కసిరి పొమ్మన్నారు ? మీతో వార్నింగుయిచ్చి కలెక్ట రుతో మాట్లాడదామనే వచ్చాను.

గిరి:—అందులో ఏదో వుత్తరంకూడా వుందినాన్నా.

మీనా:—ఏదీ (ఆవుత్తరం తీసుకుంటుంది తండ్రి చేతు ల్లోంచి. తీసి చదువుతుంది) సుబ్బావధాన్లుమామయ్య వ్రాసిన వుత్తరం యిది.

సోమ:—అయుంటుందిలే...అహహ అదికాదు. ఆవుత్తరం యీాయనకిచ్చేనుగా ... ఏదండీ ఆ వుత్తరంకూడా యిప్పించండి కలెక్టర్కు చూపించి మాట్లాడాలీ

ప్రిన్సి:—చూపిస్తే చూపించండి ... మీాఅమ్మాయి భాగవతం అందరికీ తెలుస్తుంది ... యిదిగో (ఆకుపచ్చ వుత్తరంవున్న కవరు తీస్తాడు) కావాలా మీాకు ?

ఇదిగోనయ్యా కుమారశాస్త్రి మీానాక్షి వినండి. అయ్యా ! మిగతా పెద్దలుకూడా వినండి.

ప్రణయవిహార్
ప్రేమనగర్
వసంతర్స్త్రం

హేప్రియే ... ...

నీప్రియ
బోకు

ఏం మీానాక్షీ ! ఆవేళ నలుగురిలోనూ ఎందుకని పిలిపించి యీాభోగట్టా లడిగితేనేకదూ యింత హడావుడిచేసావ్ ? నా అంతవాడు ప్రిన్సిపాలుగా వుండగా యిలాంటిపనులు చేయొచ్చునా అంటే తప్పొచ్చిందేం ?

ఏయయ్యా కుమారశాస్త్రీ, నువ్వు రాసిన వుత్తరమేనా యిది. బోకంటే నువ్వేనా ? ... యీా గొడవలేమిటని అడిగితే నన్ను తన్నించావ్ కాదూ ?

గిరి:—ఏం నాన్నగారూ తెలిసిందా మేష్టారి భాగోతం - మనింట్లో యెందుకంటే నెత్తి నెక్కించుకున్నారు ... మళ్ళీ Dismiss చేసీయండి సార్.

సోమ:—ఏమయ్యా! ఏదో యోగ్యుడివనుకుంటే నువ్వుచేసే ఘనకార్యమిదా ? ... చాలు నాయనా బుద్ధి వచ్చింది ... (ప్రిన్సిపాలుతో) యింతకీ యీవుత్తరం మీకెలావచ్చింది ?

ప్రిన్సి:—మహా చెడ్డచావొచ్చింది మీతోనూ ... యిదిగో మొన్నమీరిచ్చిన కవరూ ? అందులోవున్న వుత్తరం యిదేనూ ... వీడిభోగట్టా కొంచెం కనుక్కోండి అని అడగలేదూ మీరు ... క్లాసవగానే వస్తా డుండండి అని మిమల్ని ఆపితే యితను రాలేదూ ? మీరు దెబ్బలాడి యింటికి తీసుకువెళ్ళలేదూ యితన్ని? అప్పట్నుంచీ మీయింట్లో యితగాడు తిష్ట వేయలేదూ ... ఆతర్వాత మీ అమ్మాయిని కేకలు వేయబోతే నానా అభానూచేసింది ... ఏం? మీనాక్షీ !

మీనా:—మీరు త్తరంలో ముక్కలు చదివేరని ఎలా అనుకోనూ ? అసలాయన అలాంటి వుత్తరాలు రాస్తారని మాత్రం అనుకున్నానా ? ... ఎకెండర్ని కూడా పైకిపొమ్మని అంత యిదిగా అంటుంటే యింకా ఏదో అనుకున్నాను.

కుమా:—అయ్యో! మళ్ళీ నేనే ఆవుత్తరం రాశానన్నట్లు మాట్లాడతారేమిటి? ... చూడండి ఆవుత్తరం? .. ఏదీ ఆవుత్తరం (పుచ్చుకుంటాడు) ... యీ దస్తూరీ నాదికాదు. ఏదండీ ఆకవరూ ... ఎడ్రసు చదవండి. మందబుద్ధుల సోమప్పశాస్త్రి బావగారికి - ఉల్లితోట వీధి బిజిలీనగరం యిలా ఎవడేనా రాస్తాడూ.

గిరి:—అది సుబ్బావధాన్లు మామయ్య వ్రాసినకవరు ఉత్తరం మాత్రం యీాయన రాసిందే ... ఆయన తెలుగు Text లో పెట్టి పంపించేరు ... వీడే ... యీ మెటెండరే తెచ్చాడు. ఆ వుత్తరం చదువుతుంటే సింహాం వస్తున్నాడని దాచబోతే కవరుతోపాటు తన్ని లాక్కుపోయాడు ... ఇది అది కాదని చెప్ప లేదట్రా సింహాం! ... నీతో చెప్పలేదక్కయ్యా తెలుగుమేష్టారి వుత్తరం తన్ని లాక్కుపోయాడని.

సుబ్బా:—అయితే నేను రాసిన వుత్తరమేదర్రా.

గిరి:—ఆ ఏడుపు వుత్తరమేనా? అది అక్కయ్య కిచ్చాను. ఎక్కడో దాచింది.

మీనా:—ఇదిగో యీ కవరులో వున్నాయి ... నిన్న T. C. లు జాగ్రత్తచేసా నిందులో ... దానిసంగతే మర్చిపోయాను ... ఇదిగో (యిస్తుంది)

సోమ:—ఇదేనండి ప్రిన్సిపాలుగారూ యీ వుత్తరమనుకొని ఆ వుత్తరం మీాకిచ్చేసేను ... ఏదబ్బాయి గిరీ! అది చదువు.

సుబ్బా:—ఎందుకూ యిలా యివ్వండి (కొంత చూస్తాడు) ఆ! ఇది నేను రాసిందేన్రా ... ఏదీ ఆకవరు (కుమారశాస్త్రిగారి దగ్గరున్నకవరు పుచ్చుకుంటాడు) యీ దస్తూరీకూడా నాదేన్రా.

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చింది ... సరే యీబోకు వుత్తరం యెలావచ్చింది? ఏమయ్యా కుమారశాస్త్రీ? నువ్వు రాసిందేనా?

కుమా:—కాదు. నా దస్తూరీకాదు. నేను రాసింది కాదు. ఏదీ? కాదు. Text మాత్రం పంపించేను. ఇతనిచేతే యీ ఎడెండరుచేతే ఏమయ్యా.

ప్రిన్సి:—Text మాత్రం ఎందుకు పంపించేవు? ఏం? వాళ్ళు కొనుక్కోలేరా?

కుమా:—అమ్మాయే అడిగింది. తనకి సీనియర్ బేచ్ వాళ్ళ పుస్తకా లేమన్నావుంటే చూడమని ... అలాగే పంపాను ... ఏమమ్మా!

మీనా:—అవునండి ... పుస్తకం అడిగేనుకాని వుత్తరాలు వ్రాయమన్నానా మిమ్మల్ని?

కుమా:—నా దస్తూరీ కాదంటుంటే ... ఏదీ అసలు నీపేరు గాని వూరుగాని ఇందులోవుందా? ... ఏదీచదవండి.

సింహాం:—(కుమారశాస్త్రి దగ్గరున్న ఆకుపచ్చ వుత్తరం తీసుకుని) నేను చదువుతా నిలాయివ్వండి ... (ఉత్తరం చదువుతాడు.)

కుమా:—ఏదండీ అందులో ఎవరికి రాసిందీ వుందండీ ?

ప్రిన్సి:—అయితేసేం నువ్వే వ్రాసుంటావ్ ?

కుటుంబం:—అది రాసింది నేను సార్ !- ఈ ఎరెండర్నడ గండి ముందు. అతని కేమన్నా మొన్న కాగితం యిచ్చిందీ లేనిదీ.

ప్రిన్సి:— ఏం ! నీ కేమన్నా కాగితం యిచ్చాడా? యీ అబ్బాయి.

ఎరెం:—ఏదో ఆకుపచ్చ కాగితం యిచ్చేరండి తెలుగు లెక్చెరరుగారి కిమ్మని ... ఎందుకని అడిగేనండి కాలేజీ మేగజీనుకని చెప్పమన్నారండి. ఇప్పుడు మేష్టారిదగ్గరకి వెళ్ళడం లేదన్నానండి. పోనీ ఎప్పుడు వీలైతే అప్పుడు యిమ్మన్నారండి.

ప్రిన్సి:—మరి తర్వాత తెలుగు లెక్చెరర్కి యిచ్చావ్ ?

ఎరెం:—లేదండి. ఆయనదగ్గర్నుంచే పుస్తకం పట్టుకొని వెళ్తుంటేనే యీాయన దారిలో కనబడి యిచ్చేరండి

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిందిరా నీతోనూ- మరి తెలుగు మేష్టార్కి యిచ్చావ్ ?

ఎరెం:— లేదండి ... ఆపుస్తకంలోపెట్టి మర్చిపోయేను. ఇప్పుడు జ్ఞాపకం వచ్చిందండి.

కుటుం:—కాలేజీ మేగజీనుకి వ్రాసిన ప్రేమలేఖ అండి.

ప్రిన్సి:—మరి నీక్లాసూ, పేరూ ఎందుకు వ్రాయలేదు ?

కుటుం:—నాపేరు దిగువను వ్రాసేనండి ... నా పేరు బోడస కుర్రు కుటుంబం కాదటండి. friends కి తెలిసేలాగా మేష్టార్ని అల్లరి పెట్టినట్లూ వ్రాసేనండి.

ప్రిన్సి:—మరి పైని Heading లేదేమయ్యా.

సుబ్బా:—అయ్యా! మావాడి కథలగురించి అలా అంటా రేమిటి? ఏదో ప్రయోజనం లేకుండా అలారాయడు.

కుటుం:—ఈరోజుల్లో శీర్షిక లేకుండా కథలూ, గేయాలూ, లేఖలూ వ్రాయడం ఒక విప్లవం ... అంతకీ అయితే ఎడిటరే వ్రాసుకుంటాడు లెండి.

ఎటెం:—సరే ఎవడో రాసుకుంటాడు లెండి. కానిమరి నన్నెందుకు కొట్టారో కాస్త కనుక్కోండి బాబయ్యా ... తమరి మొహం చూసి వూరుకున్నాను.

కుటుం:—ఎవడు కొట్టాడ్రా నిన్ను- మహా చచ్చిపోయినట్లు మాట్లాడతావేం?

సింహాం:—చచ్చిపోయినట్లు మాట్లాడ్డ మేమిటా?.

సుబ్బా:—అహా అదికాదబ్బాయ్ - మా వాడు వట్టినే ఏమాటా అనడు - ఏమాటా వాడడు - ఏదో కవి ప్రయోగమయుంటుంది - ఏంరా అబ్బాయ్.

ఎటెం:—ఎవడియోగమో చూస్తారు కాని నామాట చూడరేం? యీ అబ్బాయిగారెందుకు కొట్టారో కనుక్కోండి సార్!

ప్రిన్సి:—మహా చెడ్డ చావొచ్చిందిరా నీతోనూ ... ఆ! నా ఎటెండర్నెందుకు కొట్టావబ్బాయ్ ?

సోమ:—ఎందుకో కొట్టుంటారులెండి ... అసలు మావాళ్ళ T. C. లెందు కిచ్చేసేరో చెప్పేరుకారు ?

ప్రిన్సి:—మీరా అమ్మాయి నడగండి. ఎందు కప్లికేషను పెట్టిందీను T. C. యిచ్చేయమని ?

సోమ:—అవునటే మీనాక్షీ ! T. C. యిచ్చేయమని అప్లికేషను పెట్టావుటే ... అవునట్రా సింహం మరి చెప్పవేం అప్లికేషను పెట్టారని.

సింహం:—అదికాదు మామయ్యా ! మీనాక్షీ అప్లికేషను పెట్టింది. ఆవిడ T. C. కోసం వెళ్తేనా T. C. కూడా యిచ్చేసేరు.

సోమ:—ఇచ్చేసేరులే... అహాహా అదికాదు - ఏం మీనాక్షీ! అప్లికేష నెందుకు పెట్టావ్ ?

మీనా:—ఆవేళ రూంలో వుత్తరం గొడవడుగుతూంటే భయంవేసింది నాన్నగారూ, ప్రిన్సిపాలుగారేదో అనుకున్నాను ... ఉత్తరం గొడవని చెప్పక ఏవేవో అంటుంటే ఏదో అనుకున్నాను ... అందాకా యిది వుంచు యింకా అందితే యిస్తానని ఆయనంటూ కవరిస్తూంటే సొమ్మనుకున్నాను. ఏదో అపోహాపడ్డాను.

ప్రిన్సి:—సరీ. మరలాగ చెప్పలేదేమయ్యా Ham ! పెద్ద లార్డులావచ్చి అల్లరిచేసావుగాని అసల్ది చెప్పలేదేం ?

ఇంకా మేష్టారే నిన్ను లేవదీసాడనుకున్నాను. ఛీఛా అల్లరి మేష్టారూ నువ్వూ చేస్తున్నారని నీ T. C. కూడా యిచ్చేమన్నాను ... అయితే మీనాక్షి చెప్పిందా నీకు నాగదిలో గొడవ.

సింహాం:—లేదండి ... ఎరెండరు చెప్పాడు.

ఎరెం:—మరి నన్ను కొట్టిందాని మాట చెప్పరేం?

ప్రిన్సి:—మహా చెడ్డచావొచ్చిందిరా నీతోనూ ... యిదట్రా నువ్వు చేసినపని ... ఇక్కడి వక్కడకు మోసీసేవ్?

ఎరెం:—మరి అక్కడి విక్కడ తమతో చెప్పలేదేటండి?—మేష్టారిలాగన్నారని ఆలాగన్నారని మీ పని పట్టేస్తానన్నారనీ

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిందిరా నీతోనూ ... సరే నయ్యా! కుమారశాస్త్రీ! బాగానేవుంది...ఉత్తరం రాయలేదూ సరే...మరి ఆరౌడీవెధవల్ని పెట్టి నన్ను...

గిరి:—ఆయనకాదుసార్ నేనారాత్రంతా ఆయనతోనే వున్నాను. తమరా సందుమొగని మమ్మల్ని చూడలేదూ. సింహాంబావ తెలుగుమేష్టరుగార్ని తంతానన్నాడని ఆయనవెనకాలే నేనూ వెళ్ళేను – ఆవేళ II Show సినీమాకి వెళ్తున్నామప్పుడు.

సింహాం:—బావుంది. మేష్టార్ని తంతానన్నాన్రా?

గిరి:—అవేళ నువ్వు కత్తి అడగలేదూ నన్ను?

ప్రిన్సి:—సరేనబ్బాయ్! మేష్టార్ని కాకపోతే యింకెవర్నని నీవుద్దేశం?

సింహం:—మీరేమీ అనుకోకపోతే ... మిమ్మల్నే అనుకోండి గాని నేనూ మావాళ్ళూ ఒచ్చేసరికే మిమ్మల్నెవరో కొట్టేసేరు ఆ సందుమొగని.

ప్రిన్సి:—అయితే ఎవరయినట్టు...మీరా? మీగా? ... మీరా...నువ్వా...ఏం కుటుంబం నువ్వా? (ఎటెండర్ని) ఏం రా నువ్వా?

మీనా:—మీరేమీ అనుకోకపోతే వాళ్ళని Excuse చేస్తే చెబ్తాను.

ప్రిన్సి:—చెప్పూ. ఫర్వాలే - యీగొడవంతా ఒకగారడీలా వుంది ఎవర్నీ యేమీ అనాల్సిన పనిలేదు. అంతా తప్పుల తమాషా.

మీనా:—ఈ ఎటెండరు మా Girl Students తో అవేళ మీ 'రూం' లో జరిగిన గొడవ చెప్పేడట...వాళ్ళు నాతోనన్నా చెప్పకుండా ఎవర్నో పురమాయించారు.

ప్రిన్సి:—(సిగ్గుపడ్డాడు. అభిమానంతో) సరే! సరే! ... అయ్యా మీరెవరూ యీ గొడవ యింకట్టే ఎవరితోనూ చెప్పకండి!

... సింహం! మీనాక్షీ! మిమ్మల్ని Readmit చేసుకుంటున్నాను. ఏమయ్యా కుమారశాస్త్రి

యీవేళే క్లాసులు తీసుకో......బాబూబోడసకుర్రు కుటుంబం యింక యిలాంటి కవిత్వం వెలిగించకు నీపుణ్యమాయెను.

ఎటెం:—మరి నన్నెందుకు కొట్టిందీ కనుక్కున్నారు కారు. మీా యిదేగాని

ప్రిన్సి:—ఫర్వాలేదులే ... నీ కా మాత్రం అప్పటప్పట మోతాదుగా తగుల్తుండాలిలే ... యీావేళ్టినుంచి నువ్వు Physical Instructor గారి దగ్గరకుపో ... నే నింకోణ్ణి చూచుకుంటాను. నువ్విటూ అటూ అంటించడాన్ని నీకామాత్రం అంటించేరు సరిలే.

సుబ్బా:—మావాడి ఏడుపూ నా ఏడుపూ తీరేయి మరి మాకు సెలవా ?

సోమ:—ఏమయ్యా కుమారశాస్త్రీ లాడ్జినించి సామానదీ పట్టుకురాకపోయేవంటే చూచుకో ... ఆఁ నేనసలు సరియైనవాణ్ని కాను. ఒరేయ్ సింహాం క్లాసులికి పదండిరా. పదరా గిరీ పదవయ్యా సుబ్బావధాన్లు బావా. పిల్లలు క్లాసులవగానే వస్తారు. వెళ్ళరా కుటుంబుడూ మాదుంప తెంచేవు ఆ Strike ఏదో చూడు ... నీకవిత్వం మండేను.

(కుటుంబం నిష్క్రమణ

సుబ్బా:—మా వాడి కవిత్వం నీ కింకా తెలియదులే ... శ్లేషకవి అని U. P. లో పేరు.

సోమప్ప:—అయ్యా? మరి మాకు సెలవా? అంతా గారడీ లాగా జరిగిపోయింది. అన్నీ మరచిపోవాలి? ఏదో ముసలివాణ్ణి నేనేనా చూచేనుకాదావుత్తరం? ఒకళ్ళ నొకళ్ళు క్షమించీసుకుందాం అదే తీరేను.

(కుమారశాస్త్రిగారికీ జయ్ – ప్రిన్సిపాలుగారికీ
జయ్ – K. M. P. కాలేజీకి జయ్
కుటుంబానికీ జయ్ ... అన్న
కేకలు పైనుంచి)

(సోమప్పశాస్త్రి, సుబ్బావధాన్లు, గిరీ నిష్క్రమణ)

ప్రిన్సి:—పదండయ్యా క్లాసులికి ... మహాచెడ్డచావొచ్చింది మీతోనూ.

(సింహం, మీనాక్షి, కుమారశాస్త్రి నిష్క్రమణ)

నువ్వు పోరా Physical Director గారి దగ్గరకీ. అక్కడి ఎటెండర్ని నాదగ్గరకు పంపు.

ఎటెం:—ఇప్పుడే వెళ్ళాలాండి?

ప్రిన్సి:—అవును.

ఎటెం:—రేపు జాయినయితేనండి?

ప్రిన్సి:—వీల్లేదు.

ఎటెం:—Physical Director గారు నువ్వు నా కొద్దుపో అంటేనండి?

ప్రిన్సి:—అన్నాసరే ... నా ఆఫీసులో నువ్వొద్దు.

ఎటెం:—జీతం హెచ్చిస్తారేమిటండి?

ప్రిన్సి:—లేదు. ఒక్క దమ్మిడీకూడా హెచ్చులేదు. ఫో.

ఎటెం:—Physical Director గారు తన్ని తగిలేస్తేనండి ?

ప్రిన్సి:—ముందు వెళ్ళరా అంటే? ... ఆయ నొద్దంటే వచ్చీసేయ్.

ఎటెం:—అయితే మరెందుకండి వెళ్ళడం ... ?

ప్రిన్సి:— మహాచెడ్డ చావొచ్చిందిరా నీతోనూ ? మరెం కెప్పుడూ రాయబారాలపై మోయకు. ఇక్కడి వక్కడా అక్కడి విక్కడా చెప్పకూ ? ... ఏం ?

ఎటెం:—ఇంకా చెప్తానాండి ? కుర్రాళ్ళు వీపు పెట్లగొట్టే సేరుకదా ? ... అయినా తమరు చెప్పమంటే చెప్తా నా ? ... చెప్పొద్దంటే మానానా ?

ప్రిన్సి:—మహాచెడ్డ చావొచ్చిందిరా నీతోనూ ?

ఎటెం:—ఏమోగానండి ? నాకు మాచెడ్డ సరదాగా వుం దండి ... సెలవైతే యీవేళటికి అందరినీ యిళ్ళ కెళ్ళమందామండి.

— తెర —

---

కాకినాడ : మాస్టర్‌మన్ ముద్రాశాలయందు ముద్రింపబడియె.

గిరి:——సరే- నామీఁదే తోసేయ్! చెప్పకపోతే చూడు అన్నిగొడవలూను.

సింహాం:——చెప్పఁకోన్. (నిష్క్రమణ)

గిరి:——చెప్పఁకోన్- మేష్టార్ని రక్తంతాగేస్తా తాగేస్తానని, Principal బుర్ర చిదగ్గొట్టి, నేను కొట్టానంటా డేమిటి. అయితే యింతకీ యెవడుకొట్టాడు?

(ఇంతలో మీనాక్షి ప్రవేశిస్తుంది)

మీనా:——ఒరేయ్ గిరీ! సింహాం బావొచ్చాడ్రా?

గిరి:——ఒచ్చాడు! వెళ్ళాడు. ఇవిగో T. C. లు యిచ్చేడు- ఏదేనా కవరుచూచి అందులో పెట్టమన్నాడు- (యిస్తాడు) అది సరేకాని అక్కయ్యా!...నువ్వేనా Principal ని కొట్టింది?

మీనా:——నీకేం మతిపోయిందేమిటి? నేను కొట్టడమేమిటి?

గిరి:——వాడికేం మతిపోయిందేమిటి? నేను కొట్టడమేమిటి?

మీనా:——అయితే Principal ని కొట్టారేమిటి ఎవరన్నానూ?

గిరి:——పురమాయించిందానివి నీకే తెలియాలి?

మీనా:——ఏం? నీకెలా వుందేమిటి?- నాన్నగారు రానీ చెబ్తాను.

గిరి:——నేనూ చెబ్తాను ... నువ్వు T. C. ఎందుకు పుచ్చుకున్నదీను.